శ్రీ రస్తు.

# వైజయంతీ విలాసము

నామాంతరము

# విప్రనారాయణ చరిత్రము.

సారంగు—తమ్మయ ప్రణీతము.

మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

1906

వెల 6 అణాలు.

# విజ్ఞాపనము!



వైజయంతీవిలాస మను నీగ్రంథము మిక్కిలి మంచికథ కలిగినదగుటను, కథ కనుగుణమగు శైలి గూడ గలిగిన దగుట ననేకులచే నాదరింపఁబడు చున్నది.

ఈ కవికాలము నిర్ణయించుటకుఁ క్రింది విషయము లాధారములు.

పాండురంగ మాహాత్మ్యమను నీగ్రంథమునఁగల గురువర్ణనపద్యములం బట్టిచూడఁగాఁ దెనాలి రామకృష్ణునికి నీ సారంగు తమ్మయ్య యను గురువొక్కఁడయినట్లు తోఁచుచున్నది. అయినను రామకృష్ణకవికాలము నిర్ణయించుటకష్టము. "ఇనసమ" అనుపద్యముంబట్టి 1581-1611 సంవత్సరముల మధ్యకాలమువాఁడని నిర్ణయించవచ్చును.

ఈకవి మాధ్వుడని తెలియజేయు నంశము లేమియు గ్రంథ మందు లేకున్నను, రాజమహేంద్రప్రాంతముల నున్న సారంగు వారను మధ్వుల నెఱిగినకతమున శ్రీ వీరేశలింగముపంతులవారీతని మధ్వుడు కావచ్చునని రి. అది సమంజసము గాదు. నందూరుయింటిపేరు గలవారు నాలుగు కులములలో నున్నారు. ఈకవి వైష్ణవ గురుకులవాసము చేయుటచే నీవైష్ణవచారిత్రమును రచియించియుండును. ఈ గ్రంథమందు వైష్ణవమతసాంప్రదాయములు చక్కఁగా వర్ణింపఁబడినవి.

గ్రంథనాయకుఁడగు విప్రనారాయణుఁ డరవమున శ్రీతొండరడిప్పొడియాళ్వారని పిలువఁబడుచున్నాఁడు. కవితాశైలి మనోహరముగ నున్నది.

ఈగ్రంథ మిదివఱకు అముద్రితగ్రంథ చింతామణి పత్త్రికాధి పతులగు మ. రా. రా. శ్రీ. పూండ్ల రామకృష్ణయ్యగారిచే ముద్రింపఁబడినది. ఆంధ్రభాషావిషయిక శోధనలనేకముచేసి, ఆంధ్రజనుల మెప్పువడసి ఇప్పుడు కీర్తిశరీరముతో నంధ్రభాషకు సేవఁజేయుచున్న యా మహామహుఁడాతఁడు ముద్రించినగ్రంథములన్నియుఁ గర్చుపడుటచేతఁ దిరుగ నన్ను ముద్రించి ప్రకటించుమని నాకొకప్రతిని 4 సంవత్సరముల క్రిందట నేపంపిరిగాని యాయన జీవించియుండఁగా నీగ్రంథమును ముద్రించలేకపోతిని. నేటికెటులనో యనేకదోషములను సరిచేసి యీగ్రంథము ముద్రించి ప్రకటించితిని. భాషావిదులిందలి దోషములను దెలియఁజేసిన నీగ్రంథము తిరిగి యచ్చుపడు భాగ్యమబ్బెనేని సవరణచేసెదను.

ఇట్లువిన్నవించు విధేయుఁడు,

నందిరాజు చలపతిరావు.

# వైజయంతీవిలాసము.

(విప్రనారాయణచరిత్రము.)

---

ప్రథమాశ్వాసము.

---

ఉ. శ్రీవసుధాసుతాంఘ్రి పరిరంభ శిరీషసరోపసూన మీ
క్ష్మావరుకేల్ని సర్గగుణకర్కశ మశ్మము మెట్టఁ బల్కె నె
ట్లీవసుధామయం బనుచు నింతులు పల్కఁగ నంటఁ గొంచు లో
కావనుఁ డైన రెండ్లకొడుకు కస్మదభీప్సితముల్ ఘటించుతన్. 1

చ. జనులు లయ పండ సాఫానుఁడు చాపలతం దరియంగఁ జూచి లో
నినిచిన కూర్మి నీపలను నెమ్మి రహి న్బరి పిప్ప సయ్యెడం
గనుఁగొనువారికి న్గలిగె గన్నులపండు పటంబు సెచ్చెలుల్
ననువులు పల్కఁ గన్గొనల నవ్వ ధరాసుత మమ్ముఁ బ్రోవుతన్. 2

చ. మిహిరతనూనపాద్యుతుల మించి సమంచదుదారశక్తిచే
బహిరబహిస్తమస్తతులఁ బాపుచు శేషశయానుకార్య ని
ర్వహణ సమర్థ మై యతిపరంపరఁ బెంపెసలార్చు సమ్మహా
మహము సుదర్శనం బెపుడు మత్కృతిఁ గూర్చుఁ బ్రసన్నభావమున్.

క. అమరఁగ నేకాను శేష
త్వమునన్ శేషిత్వసార్థతం బరగును ద

త్కమలాత్ముం డట్టి సహ
ప్రముఖుండు వచనపరంపరఁ గృప సేయున్.

శా. దాసుం డై సఖుఁ డై తురంగ మయి చిత్రచ్ఛత్ర మై మేలుక
ట్టై సింహాసన మై సుమవ్యజన మై యంశోత్తమం బై రమో
ల్లాసిం జేరి భజించు వేదమయుఁ గల్యాణప్రదు న్గీర్తిరు
ద్రాసీమంతవతీమనోహరు గరుత్మంతుం బ్రశంసించెదన్. 5

ఉ. వేత్రలత న్ధరించి యరవిందభవాండచరాచరావలు
ల్చిత్రగతి న్నటించుటకు శిక్ష యొసఁగఁగ సూత్రధారుఁ డై
మిత్రశశాంకలోచనుఁడు మెచ్చఁ బరాంకుశవృత్తిఁ జెందునా
సూత్రవతీశుచేఁ గవిత చొప్పడుఁ గాత నిరంతరాయ మై. 6

ఉ. మంజుతరోష్ఠబింబము సమంచితదాడిమబీజపఙ్క్తి లే
కం జవిఁ జూచి పల్కు చిలుక ల్ప్రియము ల్చినక న్జతుర్ముఖీ
పంజరపాలిక న్బెనుచు ప్రౌఢవినోది ఘటించుఁ గావుతం
గంజభవుండు మత్కృతి ముఖంబున విశ్వజనప్రమోదమున్. 7

శా. వీణాతంత్ర లసద్గుణంబులు ముదావిర్భావముం జేయఁగాఁ
బ్రాణంబు న్బలె నొత్తుడించుక సుధాప్రాయానులాపంబుల
న్వాణిం గూర్చుచు సారెసారెకు రుచుల్ వాటింపఁ బల్కించు న
వ్వాణీదేవి నటించు మద్విమలజిహ్వారంగమధ్యంబునన్. 8

ఉ. మాటికి నిష్కళంకముఖమండలిఁ జంక్రమణంబుఁ జూచి చె
ల్వేటిది యంచు గౌరి చలియింపఁగఁ దన్కృగడింభము న్జటా
జూటతలంబున న్బిలుచు సోముని జూపి సుధాశ గొల్పుచు
న్బోటిని వేడు నగ్గిరివిభుండు కృప న్నముఁ బ్రోచుఁ గావుతన్. 9

ఉ. వేదలసచ్ఛిఖాముఖ్యలు లహేనవేయనుఁ బ్రసత్తివాసనా
స్వాదము గ్రోలుచున్ మలయశైలమరుత్తులు తేఁటి రీతి సం
శ్రీదయితంబుగా సహపరిష్ణువుఁ జేయుచు రట్టి యాదిమ
ద్వాదశసూరివర్యుల పదంబులు మానసవీథిఁ గొల్చెదన్. 10

క. మందారు దాసజనతా
మందారు ద్వైదశాస్త్ర మహిత ప్రజ్ఞా
బృందారక గురు మద్గురుఁ
గందాళప్పలగురు న్జగద్ధితుఁ గొలుతున్. 11

క. జాతుల వార్తల నుపనుల
రీతులఁ బదబంధముల ధరిత్రీతల వి
ఖ్యాతిగఁ గృతు లొనరించు పు
రాతన నూతన కవీశ్వరావళిఁ గొలుతున్. 12

క. గణశుద్ధియు గుణశుద్ధియు
గణుతించిన లేనివారు కవిత లటంచు
న్గణములు దెలుపుకొనంగా
గుణదోషము లెంచ నేల కుకవుల యందున్. 13

వ. అని ప్రధాన దేవతా నమస్కారంబును, ననుచితేతర పురస్కారంబును, నిజ గురు వందనంబును, సుకవి వందనంబును, కుకవి నిందనంబును గావించి మదీయ వచోవిశేషంబుల రఘువంశవల్లభునిఁ బొగడ ద్దలంచినవాఁడనై తదీయ దాస్యవిహితప్రచారం బగు మదీయ వంశ ప్రకారం బభివర్ణించెద. 14

## కవి వంశానుక్రమణిక.

మ. ఇల శ్రీరామున కేమహర్షి వనిలో నిష్టాప్తిచే రాక పో
కలఁ బ్రేమ న్ఘటియింపఁ బర్వతములై కన్పట్టు ప్రామిన్కు లా
మలకంబు ల్బలెఁ గేలఁ గైకొనియె నమ్మౌనీంద్రుఁ డానిష్ఠురో
జ్జ్వల దుర్లోక మహాస్సమాజుఁడు భరద్వాజుండు తాఁ బెంపగున్.

వ. ఆ ఋషిమిత్ర పవిత్ర గోత్రంబున. 16

క. శ్రీరంగ హిమవదంతర
భూరంగత్కీర్తి యగుచుఁ బొగడిత కెక్కె
న్సారంగధరుఁడు నిర్జిత
సారంగధరుండు కీర్తిసర్వజ్ఞుఁ డిలన్. 17

క, సారంగధరుఁడు వెలయఁగ
సారంగుని వారటంచు సచివాగ్రణులై
పేరుం బెంపును గాంచి రు
దారత నయ్యభవు లనఁగఁ దద్వంశభవుల్. 18

శా. ఆ సారంగధరుండు గంగ మను భార్యారత్నముం బెండ్లియై
వాసి న్వన్నెయు రా మెలంగి కనియె న్పంచాపను న్బావను
న్భాసమ్రాడ్గణకావతంస నిరతాభ్యర్థితనానాకళా
ధీసంధానసురేంద్ర మంత్రి గిరిమంత్రి న్మంత్రిమందారమున్. 19

క. గిరిమంత్రిమౌళి చంద్రమ
తరుణీమణి యందుఁ గనియె దానకళాభా
స్కరతనయుని ధరఁ దమ్మన
ధరధైర్యు ననూనశౌర్యుఁ దత గాంభీర్యున్. 20

మ. అనఘుం డాగిరి దండనాయకుని తమ్మామాత్య సద్దాన సం
జనితోదారయశోవిలాసములు నిచ్చల్ గేరు మందాకినీ
ఘనసారామృతహారహీరసురగాద్గాంధర్వగంధేభచం
దనమందారసుధాంశుబింబముల యందంబుల్ పినిందించుచున్. 21

ఉ. తమ్మనయంబుఁ బ్రోచుటకు ధారుణి బంధులు బంధుపారిజా
తమ్మన రామభక్తి గని తార్కికు లెల్లను వీని గౌర చి
త్తమ్మనఁ జూపులం దనిసి ధార్మికు లీతని దెంతమంచిన్వ
త్తమ్మన నాగిరిప్రభుని తమ్మన మించె నుపంచితస్థితిన్. 22

ఆ. తమ్మమంత్రి గాంచెఁ దిమ్మాయి యందు నం
దనుల శౌర్యసింహు నారసింహుఁ
జతురబుద్ధిచంద్రు సత్కళాగుణచంద్రు
గిరిచమూవరేంద్రుఁ గీర్తిసాంద్రు. 23

వ. అక్కుమార రత్నంబులయందు. 24

క. సారంగు తమ్మమంత్రికు
మారుఁడు నరసింహమంత్రి మహీరక్షా కెక్కున్
ధారాళదాన శమ దమ
పౌరుషగాంభీర్య ధైర్యపటుశౌర్యములన్. 25

సీ. ఏమంత్రి దాతృత్వ మినశసూభవకల్ప,
భూజాతమేఘుల కోజబంతి
యేమంత్రి మతిలీల యిభవక్త్రషణ్ముఖ,
స్వగధీశ్వరులమనీషలకు ధాత్రి

యేమంత్రి సత్కీర్తి హిమశైలకైలాస,
పర్వతేంద్రులకు సౌభాగ్యమంత్రి
యేమంత్రి విక్రమం బింద్రనందన భీమ,
నకుల తదనుజ సన్మానకంబు
గీ. పరగ నేమంత్రి తేజంబు పవనమిత్ర,
భానుభవ భానులోచన ప్రభల కుద్ది
యతఁడు బుధబంధులోకసన్నుతికిఁ దగఁడె
మంత్రికుల మౌళి నరసింహమంత్రిమౌళి. 26

క. సారమతి యా నృసింహుండు
వారాశిగభీరుఁ డతులవైభవమునఁ గా
రీరమణి నీశుఁడుం బలె
నారూఢాన్వయ వరించె నక్కమసాధ్విన్ 27

సీ. అశ్రాంతశాంతిదాంత్యాదులవన్నెకుల
నల యరుంధతిసాటి యక్కమాంబ
కళ్యాణరూపసౌశీల్యలక్షణముల
నవనిపుత్రికపోల్కి యక్కమాంబ
ప్రణుతపాతివ్రత్యగుణవైభవంబున
ననసూయ సెన్నుద్ది యక్కమాంబ
యతిథిసంతర్పణవ్రతవిధానంబుల
నన్నపూర్ణకు జోక యక్కమాంబ
గీ. యనఁగ లక్ష్మీకటాక్షవీక్షానులబ్ధ
సకల సంపత్సమృద్ధిచే జగతి యందుఁ

పొగడఁ దగు నన్నదాదిక పుత్త్రజనని
హరికృపాలంబ నరసయ్య యక్కమాంబ. 28

చ. అనఘుఁడు తన్నృసింహవిభుఁ డాసతి యక్కమయందుఁ గాంచె ముం
దనుపమవర్తనుం డగు ననంతన మంత్రిశిఖావతంసమున్
ఘనుఁ డగు వేంకటాద్రిగణకప్రభుసన్నుతు నాసహోదరుల్
తనువున వామదక్షిణభుజంబులు పోలె సహాయులై తగన్. 29

చ. ఇనసమతేజులౌ నృపుల నేలు మహమ్మదుశాహి యేలు నీ
యెనుబదినాల్గుదుర్గముల నేలిన యేలిక గోలకొండ త
ద్ఘన నగరస్థలిన్ గరణికం బొనరించుచుఁ బమ్మమంత్రి యా
జనపతి రమ్ము పొమ్మనఁ బ్రజల్ జయవెట్ట గృహస్థు లౌనన్. 30

వ. అట్టి వంశంబున మహోన్నతుం డై వివిధభోగంబు లనుభవించుచు
నుండె నొక్కనాఁడు. 31

సీ. నవకోటిరుచివెంపు తరణింపుమణికిరీ
టంబువాఁడు సులలాటంబువాఁడు
ప్రతి లేక తను నొక్క భాసిలు సిరి సేరి
జోటివాఁడు సువర్ణశాటివాఁడు
కరుణారసము మించు కమలాలి వర్షించు
చూపువాఁ డెనలేని రూపువాఁడు
పలు వన్నియల మించు దులకించు చామాపు
వింటివాఁ డభ్రంబువంటివాఁడు

గీ. నగు మొగంబున నెలవంక నవిత మయిన
తిరుమణి ధరించు వాఁ డొక్క దివ్యపురుషుఁ

డెదుట నిలుచుండి నా పేర నీవు సేయు
కావ్య మంకిత మొనరింపు భవ్యసరణి. 32

క. అని పల్కనంతలో మే
ల్కని నలుదిక్కులును గలయఁ గన్గొని స్వప్నం
బునఁ గలదైవము రఘుపతి
యను భవ్యునిఁ జేయ వచ్చినాఁ డను తెలివిన్. 33

వ. ఆహా మత్పూర్వార్జితసుకృతపరిపాకం బతిమధురరసాస్వాదనంబున వెగటుపడు నతండు కట్వామ్లాదికంబు రుచి గాను చందంబునఁ బురాతనప్రాచేతసముఖ్యమహాకవివచస్సుధారసంబులు గ్రోలువీనుల శ్రీరామభద్రుండును మదీయాల్పసారవాక్యంబు లానుటకు నుత్సహించెఁ గృతార్థుండ నైతి నని య మ్మహానుభావునకు. 34

## షష్ఠ్యంతములు.

క. శుభగనిజపాదుకాఖ్య
ప్రభులంబనభూరిరాజ్య ♦ భరభరతునకున్
సభయశరణాగతామర
శుభరణునకు నతులసద్య ♦ శోభరితునకున్. 1

క. భీకరదిక్తటకరటిఘ
టాకట నిర్భేదచాప ♦ టంకారునకున్
భూకాంతాసుతభ్రా
జాకిరణాకర్కశకుభ ♦ టంకారునకున్. 2

క. ఖలతాటకావిపాటన
బలదర్పితసక్షహర్ష ♦ భావితరక్షః

కులహింసాకేతునకును
జలనిధిసైకతతులిత ♦ సాకేతునకున్.

క. రక్షోగణవిక్షోభణ
దక్షోద్భటబాణ ధారా ♦ ధళ్యాహతప్ర 3
గ్రక్షోదివాంధపక్షున
కక్షీణవచోనుపల్స ♦ హస్రాక్షునకున్. 4

క. శ్రీ మహిళామూర్త్యంబర
భూమిసుతాయోగయోగ్య ♦ భువనాద్భుత రే
ఖామంగళాంగ జితసు
త్రామమణిస్తోమునకును ♦ రఘురామునకున్. 5

వ. సమగ్రంబుగా నభ్యుదయ పరంపరాభివృద్ధిగా నభిమతార్థసిద్ధిగా నే రచియింపం బూనిన వైజయంతీవిలాసంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

## కథాప్రారంభము.

### శ్రీరంగపుర వర్ణనము.

సీ. నిలిచె నేరాజధానిఁ బయోరుహాసను
సజ్జపూల ననంతశయనమూర్తి
చెందె నేకటకంబు నందు సంతత సర్వ
పరిపూర్తితోఁ ద త్రిపాద్విభూతి
పుట్టె నేపట్టణంబునఁ దృణద్రుమలతా
మూర్తులై తన్నిత్యముక్తవరులు

ప్రవహించె నేపీటఁ బరిఖావిభూతి న
వ్విరజాస్రవంతి కావేరి పేర

గీ. వేదశృంగంబు నోంకారవిగ్రహంబు
నైన శ్రీరంగదివ్యవిమానరాజ
మెచట నివసించె నిల దాని నెన్నఁ దరమె
పుణ్యనికరంబు శ్రీరంగపురవరంబు.

సీ. ఆశించు నెపుడు నత్యాసక్తి న మ్మహా
నటుఁడు నేనగరిఁ గోణంగి యగుట
వారించు వాగ్వధూవరుఁ డతి ప్రేమ నే
పట్టణంబున మూకభావగణము
కాంక్షించు నింద్రుఁ డుత్కంఠతో నేరాజ
ధానిలోపల నుపాదానపరత
కామించు దేవర్షిగణము లే పెనుఁబ్రోల
శ్వపచపక్షిమృగాదిజంతు వృత్తి

గీ. విరజ కావేరి యై పుట్టి పరిఖ గాఁగఁ
బరమపదవల్లభుఁడు రంగభర్త పేర
నాయకుఁడుఁ గాఁగ వైకుంఠనగరి తాన
యైన శ్రీరంగపురము శక్యంబె పొగడ. 2

చ. రమణఁ జెలంగు నన్నగరి రంగవిమానశిఖాగ్రరత్నకుం
భముల నిజధ్వజం బొదువఁ బ్రత్యహమున్ జను పేళి చూచి డెం
దమున సదా చలించు నను దార్చు రమాపతియే తదేకర
త్నముగ ననంతరత్నత వృథా యనుచుం దదపాస్తతేజుఁడై. 3

ఉ. ఏతటిఁ జంద్రపుష్కరిణి నీఁతలు వెట్టుచు వేల్పుమూక సు
స్నాతృజనాఘముల్ చనెడు చందముఁ బజ్జలజాతభృంగసం
ఘాతము లుప్పరం బెగయు కైవడియున్ వివరింప నెక్కటీ
లై తెలియంగ రాని నెకయప్పటికిన్ బరకించు ఝుంకృతిన్. 4

గీ. సారసారసఁ బారకర్పూరగంధు
లాడు కావేరినీటఁ బెంపైన పైరు
పంటధాన్యంబు లచ్చటఁ బండుఁ గానఁ
బుడమిలో వడ్లు కర్పూరభోగు లయ్యె. 5

వ. అందు. 6

సీ. అలికాదికాంగంబు లనుగతశ్రీచూర్ణ
ధవళోర్ధ్వపుండ్రప్రబంధము నెరప
వదనాంబుజములు దివ్యప్రబంధానుసం
ధానవాసనతోడ నంటు సేయఁ
గంఠదేశంబులు కమలాక్షు తులసికా
మాలికాసౌహార్ద్రలీల నెరప
బాహుమూలములు శంఖసుదర్శనపాంచ
జన్యలాంఛనమైత్రి సంఘటించ

గీ. నాళకంజనాభపదమహాబ్ధిమజ్జ
దఖిలచేతనసంరక్షణావతీర్ణ
విష్ణుపర్యాయమూర్తులై వీట నుండ్రు
భాగవతు లాత్మవిద్యానురాగయుతులు 7

సీ. రమణీయతేజోవిరాజులు రాజులు
పటుపరాక్రమసముద్భటులు భటులు

నిజబలాధరితదిగ్గజములు గజములు
హరిత్రావేగజితార్క్యహయలు హయలు
వివిధక్రతు క్రీతివిబుధులు విబుధులు
కవితాలినవమరుధ్కవులు కవులు
రతిరాజుకంతహారమణులు రమణులు
వరధన్యవస్త్రపల్ వస్త్రపలును

గీ. కలిగి కైవల్యఫలదాయకక్షితిధ్ర
భూమిరుహవల్లి యైన యప్పురమతల్లి
విలయమున నశ్వరము గాక వెలయ నరసి
శాశ్వతంబుగ నేలు నధీశ్వరుండు.

సీ. విలయసన్న న్యగ్రోధదళశాయి శాంబరీ
బాలకుండు త్రిలోకపాలకుండు
కమలాకపోలకుంకుమపత్త్రరచనావి
చక్షణుండు గజేంద్రరక్షణుండు
వివిధషోడశసహస్రవిలాసినీమనో
రంజనుండు నిశాటభంజనుండు
సనకాదిసంయమీశ్వరలోచనచకోర
చంద్రిరుండు సుధాబ్ధిమందిరుండు

గీ. చరణనీరాజనక్రియాచరణ కలిత
సుమనుమాసఖశతమఖప్రముఖదివిజ
రాజకోటీరకోటీవిరాజితాబ్జ
రత్ననీరాజితవిభుండు రంగవిభుఁడు.

గీ. ఆమహాదేవి కరుణాకటాక్షవీక్ష
ణప్రభావంబు వలన నిజప్రజలకు
దురితరోగాపమృత్యువుల్ దొలఁగి చెలఁగు
పుణ్యరమతల్లి శ్రీరంగపురమతల్లి. 10

మ. వియదధ్వాన్యనతప్రభూతమహిమన్ విఖ్యాతమై తత్పురో
దయపార్శ్వంబుల నప్రయత్నపరిఖాభావంబునం బొల్చు న
క్షయపుణ్యాకరవారి వారినిధికిన్ గారాపుదేవేరి నా
గ్ధయితాద్రీంద్రకుమారికుంభభవసాక్షాన్నారి కావేరినాన్. 11

క. ఆ సరిదగ్రణి కడఁ బెం
పై సప్తశతోర్ధ్వశిఖిధరామరనివహా
వాసంబు మండగుడి యన
భూసురపుర మొకటి వెలయు భూసురపురమై. 12

గీ. ఇందిరాసఖుఁ డను పేర నందు నుండు
నాదినారాయణుండు లోకైకభర్త
ఘోరకలికాలకలుషాంధకారతతులు
పొరయకుండఁ గృపాదృష్టి పరగఁ జేసి. 13

శా. పారంపర్యసమాగతద్వయమనుబ్రహ్మజ్ఞు లామ్నాయమా
డారూఢస్ఫుటశేముషీకు లరిషడ్వర్గోద్ధితాతంకధి
క్కారస్వాంతులు నిత్యభాగవతకైంకర్యానురక్తుల్ సవ
శ్రీరామానుజమూర్తు లప్పురమునన్ శ్రీవైష్ణవాగ్రేసరుల్. 14

## విప్రనారాయణుని చరిత్ర.

వ. అందు. 15

సీ. వేదవేదాంగాదివిద్యాప్రవీణుండు
పరతత్త్వవిజ్ఞానపారగుండు

నిత్యభాగవతార్చనాత్యుత్సుకస్వాంతుఁ
డఖిలజీవదయాపరైకబుద్ధి
యతులితైకాదశీవ్రతనిత్యశీలుండు
ద్వాదశవాసరోత్సవవిధాయి
ఘనగణితశమదమాదిగుణసంపన్నుండు
త్రిభువనస్తుత్య నిర్నిద్రయశుఁడు
గీ. వంశపారంపరీలబ్ధవైష్ణవాంక
పంచసంస్కారవిభవవిభ్రాజమానుఁ
డాత్తసన్నిహితాదినారాయణాంఘ్రి
యుండు నారాయణాహ్వయుం డొక గృహపతి. 16

శా. ఆ నారాయణు ధర్మపత్నిఁ బతి సేవాలోలసంశీలతా
నూనప్రోద్యదగణ్యపుణ్య నసమానోదారశృంగారలీ
లానిస్సారితవిశ్వలోకమహిళాలావణ్య విప్రాన్వయ
శ్రీనీరాకరలక్ష్మి నెన్నఁ దగు లక్ష్మీనామధేయంబునన్. 17

క. శ్రీ రమ్యత నాలక్ష్మీ
నారాయణు లుండ్రు మనుజనారీపురుషా
కారము దాల్చిన లక్ష్మీ
నారాయణు లని జగజ్జనంబులు వొగడన్. 18

వ. ఇట్లాదంపతులు కులశీలజనస్తుత్యనిత్యానుకూలదాంపత్యంబులం బ్రవ
ర్తించుచుండ నొక్కనాఁడు. 19

సీ. మహనీయ రుద్రాక్షమాలికావలయంబు
కురుబోడితలఁ జుట్టుకొన నమర్చి

శ్రవణాక్షిఖురశృంగసహిత మై కప్పువ
సారంగచర్మ మంసమునఁ బూని
పృథులసాలగ్రామపేటీసహిత మైన
కకపాల కటిభాగమునఁ దాల్చి
కాషాయకౌపీనకలితమస్కరదండు
కుండికల్ చేదోయిఁ గదురుకొల్పి

గీ. యాదుగదుగున నారాయణా యటంచు
నరుగుదెంచెఁ దదీయగేహంబునకును
మానుకరవృత్తితనుయాత్ర మహిఁ జరించు
యతివరుం డొక్కరుండు మధ్యాహ్నవేళ. 20

గీ. వచ్చిన యతి ప్రవరునకు వైష్ణవసతి
భిక్ష తెచ్చిన నతఁ డా మృగాక్షిఁ జూచి
యెందు ననపత్య భిక్ష నే నంద నమ్మ
నొల్లక చనంగ నతని కయ్యువిద యనియె. 21

వ. మహాత్మా! వైష్ణవగృహంబున దేవపూజానంతరంబున నతిథిభాగంబు విభజించి నాయుంచిన శ్రీవిష్ణుప్రసాదంబుఁ బ్రాకృతాన్నంబునుం బోలె నుల్లంఘింపం దగునే! మీ రెఱుంగని ధర్మంబునుం గలదె యే తర్కంబు చిత్తంబునకుఁ దెచ్చుకొంటిరనిన నతం డది యట్లగా నిశ్చయించి నెమ్మది సమ్మతిలి యమ్మానుకరంబుఁ గైకొని చనియె నంత నక్కాంతారత్నంబును యతివాక్యంబు మనంబునకు ఘనం బైన ఖేదంబు నాపాదింపఁ జింతాక్రాంత యై యున్న సమయంబునఁ దదీయభర్త చనుదెంచి తన్మనోవైకల్యంబుఁ గాంచి యిది యేమి కారణం బనిన నయ్యతివ యతివాక్యం బెఱింగించి పతి కిట్లనియె.

శా. ద్రోడా యీ కుల మందు నెంచఁ దగు సాధుస్తుత్యవంశంబునన్
బ్రోడత్నంబునఁ దేజరిల్లు జననంబుం బొందినన్ వేల్పులే
గ్రిడా పోష్యజనాలి కీమె యను సత్కీర్తిం బ్రదీపించినన్
గ్రోడా లైన వధూటి జన్మ మది పేర్కో నిష్ఫలం బిస్మహీన్. 23

గీ. దానధర్మము లెన్ని చందముల నేనిఁ
దగ నొనర్చినఁ గల్గునే సుగతి జగతి
పారలౌకిక వైదికాచార నియమ
కలన గలపుత్త్రతిలకంబు వలనఁ గాక. 24

గీ. దేహి యని చేయి చాఁచిన దేహికిడను
మనకు భోగింపఁ దగిన జీవన మొసంగి
నందనానంద మిడఁడాయె నిందిరాధి
పతికి నపచార మేమి చేసితిమొ కాని. 25

వ. అనిన నయ్యతివకుఁ బతి యిట్లనియె. 26

క. కారణము లేకఁ జెందవు
ధారుణి నాపదలు సంపదలు నిందులకై
యారట పడి సర్వేశ్వరు
దూఱుట గోరుటయు వలదు తోయజనయనా. 27

వ. అని నిజకాంత నూఱడించె నారాత్రి వేకువ నయ్యిందువదన
స్వప్నంబున. 28

ఉ. నల్లని మేను నిల్వుతిరునామము పచ్చనిపట్టు నాభిపైఁ
దెల్లని తమ్మియుం గలుగు దేవుఁడు కుంకుమవన్నె పుల్గు రా

బొల్లని నెక్కి నల్పుఁ దెలుపుం గల పువ్వులదండఁ దెచ్చి యు
త్ఫుల్లనిజాంజలిం జిగురుబోఁడి కొసంగె వెసం గృపామతిన్. 29

మ. కరుణావారిధి శౌరి దివ్యసుమనోగంధోల్లసన్మాల్య మా
దరణం బొప్ప నొసంగి నప్పుడె యహో తద్వైజయంత్యంశవి
స్ఫురణన్ గర్భము దాల్చి పొల్చెఁ గడు నప్పూవుబోఁడి భాస్వద్ద్యుతిన్
హరిణాంకప్రతిపత్కళావహన శోభాంచత్ప్రతీచీరుచిన్. 30

వ. ఇట్లు గర్భంబుఁ దాల్చి నవమాసంబులు పరిపూర్ణం బైన యనంతరంబ,

క. మాసంబుల లోపల నే
మాసము దాననియె మున్ను మధుసూదనుఁ డ
మ్మాసమున నింద్రదార ర
మాసమ యప్పుణ్యవతి కుమారుం గనియెన్. 32

వ. ఇట్లు జన్మించిన యక్కుమారరత్నంబునకుఁ గ్రమంబున జాతకర్మ
నామకరణాది సంస్కారంబు లొనఁగూర్చి విప్రనారాయణాభిధా
నుం జేసి యర్హకాలంబున నుపనీతుం గావించిన యనంతరంబున,

గీ. వేదవేదాంగశాస్త్రాది విద్య లెల్ల
గురుముఖంబునఁ జదివి తత్పరత నతఁడు
విష్ణుపదభక్తులఁ గని సేవించి పుడమి
నెరఁగు మీ పాదరేణువు నేనటంచు. 34

గీ. భక్తులకుఁ దొండరంఘ్రిశబ్దమున కడియు
రేణువనఁ బొడి యనియు నీరీతి ద్రవిడ
భాషఁ బరగుటఁ జేసి తద్భాషజనము
లతనిఁ దొండరడిప్పొడి యంద్రు భువిని. 35

సీ. సాత్త్వికత్వము పురుషత వహించిన రీతి
వినయంబు మూర్తిభవించి నట్లు
కరుణ మనుష్యవిగ్రహము దాల్చిన పోల్కి
జ్ఞానంబు సాకార మైన పగిది
సత్యంబు పురుషవేషము ధరించిన లీల
తాల్మి శరీరవంత మగు భాతి
శాంతంబు మానవజన్మ మెత్తిన జాడ
హరిభక్తి తను వొంది నట్టి సరణి
గీ. సకలకళ్యాణగుణరత్న జలధి యగుచు
వెలయు శ్రీవైష్ణవాచార విమల బుద్ధి
భగవదష్టాక్షరీమంత్ర పరమజప ప
రాయణుం డైన విప్రనారాయణుండు. ౮

క. వనమాలికాంశమున సం
జనన మగుట వాసనల వశమున నతనికిన్
వనమాలిక లంబుజలో
చనునకు నర్పించు బుద్ధి జనియించుటయున్. ౯

సీ. భూతనిర్మాణైక చాతురి గల్గఁ గ
ల్పాది నెయ్యది విష్ణుఁ డజున కొసఁగ
నజుఁడు నెద్దాని నిజాత్మజుం డైనట్టి
మనువు ప్రార్థింప సమ్మతి నొసంగ
మనువు నిక్ష్వాకు వేఁడిన నేది యొసఁగెను
నర్పించె నాతఁ డెయ్యది యయోధ్య

నిష్కాస పిమ్మట నెద్ది దాఁ బూఁజించి
జానకీపతి విభీషణున కిచ్చె
గీ. నతఁడు గొనిపోవఁ జంద్రచోళాధిపతికి
నిచ్చిన వరమ్ముఁ దలఁచి వాఁ డేలు చోళ
దేశ మందున నిల్చె నేదివ్యధామ
మట్టి శ్రీరంగధామంబు నందు మిగుల. 38
గీ. ఆదిభోగీంద్ర భోగశయ్యాతలమున
నుభయదేవీసమేతుఁడై యున్న దేవ
దేవుఁ గరుణాపయోధి రాజీవనాభుఁ
బ్రేమఁ బూజించు నవపుష్పదామకముల. 39
వ. ఇట్లు పూజించుచుండి. 40
గీ. పరుల తోఁటల విరులచే నరుల నెంత
పెంపుగా స్వామికే సమర్పించుచున్న
దీనిచేఁ గూలిమాత్రంబె కాని పూర్ణ
ఫలము రాదని యొక్క యుపాయ మెంచి. 41
క. ఆమహి శ్రీరంగేశ
స్వామికిఁ బడమటఁ గవేరజాతీరమునన్
భూమకుటంబై తనరెడు
శ్రీమవటద్వీప మధ్యసీమము నందున్. 42
క. దేవార్చనానిమిత్తము
దా వేఱొక తోఁట సేయఁ దలఁచి యతం డా
తావు గృహస్థుల చేతన్
వేవిలి సుక్షేత్రభూమి విలువకుఁ గొనియెన్. 43

వ. ఇట్లు గైకొని. 44

గీ. అది మఱియు మెత్తఁగా దున్ని యచ్చుఁ గట్టి
విత్తనా లల్కి యలరఁ దీవియల యంట్లు
నాటి కారీషరజము సాంద్రముగఁ జల్లి
విసువ కేతాన నెత్తుఁ గావేరి నీరు. 45

క. జాదులు చామంతులు విర
వాదులు కురువేరు కుంద వాసంతికలున్
గేదంగులు కరవీరము
లాదిగఁ బ్రోదిగను జేసె నా రామంబున్. 46

గీ. చుట్టు పంచాది వెట్టించి కట్టె నందు
నవకముగ మూఁడు చేతుల చవికె యొకటి
నేమమునఁ బెంచెఁ దత్పురోభూమిఁ బరమ
పావనం బైన యొక తులసీవనంబు. 47

వ. ఇవ్విధంబునఁ బుష్పవాటిఁ బాటించు నతండు, 48

శా. స్వాధ్యాయంబుఁ బఠించు సాంగకముగా సంధ్యాద్యనుష్ఠానముల్
విధ్యుక్తక్రియ నాచరించుఁ దఱితో వ్రేల్చు బ్రపూతాత్ముఁడై
మధ్యేరంగశయానమూర్తి కిడు సమ్యగ్భక్తితో మాలికల్
మధ్యాహ్నంబునఁ గుక్షి భిక్షుఁ దనుపు న్మాధూకర ప్రక్రియన్. 49

క. ఈరీతిని భైక్షము తను
ధారకముగ నతఁ డనారతము నేకతమ
య్యా రామముఁ బోషించును
భూరి సముత్సుకత శిశువుఁ బోషించు గతిన్. 50

క. శ్రీధర సేవారతుఁ డగు
నా ధరణీసురుని తోడ నలరించుట కై
సాధుగతి వచ్చెనో యన
మాధవుఁ డేతెంచె వసరమాధవుఁ డంతన్. 51

## మధుమాస వర్ణనము.

సీ. మదన ప్రతాపాగ్ని మంజరుల్ వోలె లే
మావులఁ జిగురుజొంపములు వొలిచె
ననమాయుధుని కీర్తి యొసఁగు కైవడి మల్లి
కాకుంజములను మొగ్గలు దనర్చె
స్మరగజకర్ణచామరము లై పున్నాగ
ములఁ బ్రసూన గుళుచ్ఛములు ఘటిల్లె
జలజాస్త్రబలరేణువులు నాఁగ సంపెంగ
గమి మరుద్గత పరాగములు నెరసెఁ

గీ. కుసుమబాణాసనాసీరఘూర్ణమాణ
కాహళీశంఖతుత్తుంభికల తెఱంగుఁ
దాల్చె నామని యన మహాధ్వని నుదార
కీరకలకంఠసమదభృంగీకులంబు. 52

సీ. అంగజాఘాతాంతరంగజాయాకాంత
ఘోరవాయవ్యకింశాయుతములు
జరదురంగమపరిస్ఫురదుపహ్వారగిరి
స్వైరసంచారనిర్భరుతములు

స్మరసమీరకస్విన్న సరసకాంతోత్పన్న
భూరిఘర్మాంభశ్శరారుతములు
పథికమర్దన మహారథికమన్మథసహా
యారువీరవిహారచారుతములు

గీ. హరిగతి సంచరించెఁ గావేరికాప్ర
తీరసారసకమలకల్హారకుసుమవ
సారసౌరభ్యసంభారభారవహన
మార పరిచారమునఁ బూసమారుతములు. 53

వ. అప్పుడు వన్యాభిరామంబులు, వర్ధితయామంబులు, వాచాలశుక పికస్తోమంబులు, చలమానభృంగంబులు, వాహ్యాళివిహారసంగంబులు, వర్ధిష్ణుమలయపవమానంబులు, వర్జితజాతిప్రసూనంబులు, వాసిత శీతలాంభంబులు, పల్లవరాగధూసరంబులు నైన యవ్వాసరంబుల యందు. 54

క. దినమును రేలును సధికో
త్సవమున సవైష్ణవావతంసము పికస
న్నవమాలికాది సుమముల
నవమాలిక లిందిరాధినాథున కొసఁగుఁ గా. 55

గీ. పాటలాది సుగంధపుష్పప్రకరము
లామని సృజించె శ్రీరంగధామమునను
సేమపుష్పంబు లలరించు నే నటంచు
వచ్చెనో యన వేసవి వచ్చె నంత. 56

## గ్రీష్మర్తు వర్ణనము.

సీ. చండభానుఁడు కర్కాటకముఁ జేసి మున్ను దా
మహి కిచ్చు నప్పులు మరలఁ గొనియె
నాఁటిపూర్ణము లైన వసుధారకలశముల్
శివలింగమూర్తుల శిరము లెక్క
నృపమందిరముల పానీయకుంభంబులు
వెస నట్టిఁ గట్టుక ప్రేలఁ దొడఁగె
భువి నెల్ల జనుల దప్పులు మాన్ప తక్రంబుఁ
దా దప్పిగొని నీళ్లు ద్రావఁ జొచ్చె
గీ. హిమకరుఁడు కైలాసపధరసౌధాగ్ర వసతి
విడిచి వనమాలతలమున విశ్రమించె
సరిత్నిజదీర్ఘతాపనాక్రాంతనిశాప్ర
హరము లగు నట్టి గ్రీష్మవాసరము లందు. 57

మ. నవధూళీప్రవితానధూసరితనానాదిక్కులై భానువై
భవధూతాతతివారిపూర మగున బ్బల్వేసవి న్వాసవీ
యువధూసౌధశిఖావళావటుల నాట్యం బాడఁ జేయున్ దివిన్
నవధూమధ్వజదహ్యమానగహనోద్యద్భిన్నధూమచ్ఛటల్. 58

ఉ. వేసఁగి వెట్టఁ గ్రాఁగి పృథివీతల మంతయు వేఁడిమంగలం
బై సెకలీనఁ బ్రాణినివహంబులు లాజలుబోలెఁ బ్రేలఁగా
నా సమయంబునన్ శరణమై యొక కొందఱఁ బ్రోచె ధాత్రిపై
నాసవపానకించిదవశాబ్జముఖీకుచకుంభశైత్యముల్. 59

వ. తత్కాలంబున. 60

క. శ్రీరంగవిభుని సేవకు
సౌరాంగన లవనిఁ బణ్యసతు లైరో సా
మారాంగబలము లై తగు
వారాంగన లుండ్రు రంగవసతి ససంఖ్యల్. 6.

## దేవదేవి చరిత్రము.

సీ. వలరాజు శృంగారవనములోఁ గ్రొమ్మావి
కందర్పమాయలమందుఁ గ్రోవి
చిత్తజన్ముఁడు విటశ్రేణి కిచ్చిన యీవి
మదనసామ్రాజ్యసంపదలతీవి
కమలాతనూజరాగరసంపునడబావి
జలజాస్త్రు పెక్కువుసన్న కావి
పుష్పకేతనువలపులయేటినడుదీవి
శంబరారాతియార్జనపుటీవి
గీ. దాని సౌందర్యమున కీ విధాతృసృష్టి
సరిసమం బీడు జో డెన్న సతులు గలరె
పచ్చవిల్కానితో నల్లి వచ్చి రంగ
భూవసతి నున్న రతిదేవి దేవదేవి. 62
గీ. అనుచు హిమశైలసేతుమధ్యమునఁ గల్గు
ధాత్రిజను లెల్ల వినుతింపఁ బాత్ర మయ్యె
విటమృగాఖేటపర్యటద్విషమబాణ
ముక్తమాయాకురంగి యమ్మోహనాంగి. 63
గీ. ఆతరుణి యక్క బహునృత్యగీతవాద్య
కళలనెన్నిక్క వలరాజుకంచుతక్క

ధర నహి ప్రతి దాని సౌందర్యమునకు
మహితశృంగారరసవేణి మధురవాణి. 64

గీ. అర్థి నయ్యేకక్రియును జెలియలును వృత్తి
గలవాక్యనియూథిఁ బ్రఖ్యాత మైన
మేళ మొనరించుకొని ప్రౌఢి మెఱసి చోళ
విభునిఁ జోళాధిపతిఁ గాంచు నేర్పుఁ గలిగి. 65

గీ. కాంచి రయ్యింతు లంభోధికాంచినమణి
కొప్పుమాణిక్య మను పోల్కిఁ గొప్పు దాని
దంష్ట్రదైతేయసంభిమర్దనకపర్ద
మండలీఖండవిధుసుధాసునర మధుర 66

సీ. వేదశాస్త్రపురాణవిహితనానాకళా
శ్రేణి పారాయణశ్రోణిసురము
ప్రథనమర్జయరిపూర్వథనవిస్ఫురితశౌర్య
నాన్యసామాన్యరాజన్యవరము
వాణిజ్యకృషి పశుత్రాణ నిర్మలధర్మ
జీవికాధనికోరుభూవిసరము
జన్మప్రభృత్యగ్రజన్మశుశ్రూషాతి
శిప్రసుజ్ఞానశూద్రప్రకరము

గీ. నిరతసేవాగతాధీష్టధరణిపాల
తతినివాసార్థనిర్మితనవీన
జీవమణిసౌధయూథశోభావిరాజ
మానశాఖానగర మమ్మహానగరము 67

గీ. అట్టి మధురానగరముఁ దొయ్యలులు చేరి
వెసఁ బ్రవేశం బొనర్చి యవ్వేళవాటి
గోత్రపాలికపిడిది గైకొని వసించి
రంత నరుణాంశుఁడును బశ్చిమాద్రిఁ జరిసె. 68

ఉ. రాగము నిండె నంతఁ దిమిరంబును బర్వె ననంతరంబ తా
రాగణ ముల్లసిల్లె నట రాజొదవెం దరువాతఁ జంద్రికా
భోగము సాఁగెఁ బిమ్మట బుభుక్షలుఁ దీరెఁ జకోరపఙ్క్తికిన్
జాగరణం బొనర్చెఁ బటుసాంద్ర ముదావహులై కుముద్వతుల్. 69

క. ఈవిధమున నయ్యామవ
తీవైభవ మొప్ప మిగుల దృష్టించుచు ని
ద్రావశత శయ్యపం జను
కైవడి రేరాజు గ్రుంకు గట్టున కరిగెన్. 70

ఉ. ఆమొదఁ దూర్పు తెల్లనగు నంతనె శుక్రుఁడు దోఁచెఁ దారకల్
ఛాయలఁ జిల్లగింజ లయి జాఱె పదాయుధకోటి కొక్కొరో
కోయని మ్రోసె నద్దమునకు బ్రతి దై శశి తాఱె సంజకెం
పాయితమయ్యెఁ బ్రాచి నుదయాచల మెక్కెఁ బయోజబంధుఁడున్.

వ. అంత మేల్కాంచి సమయోచితకృత్యంబులు దీర్చి. 72

సీ. ముఖమజ్జన మొనర్చి నఖరేఖ రేఖగాఁ
గమ్మకస్తూరినామమ్ముఁ దీర్చి
నునుపుగాఁ జట్టు పున్గున దువ్వి పువ్వుదం
డల తోడఁ గొరకొప్పులు ఘటించి
సొమ్ముల సొమ్ముగా నెమ్మేనులకు వింత
యందంబుగాఁ దావిగంద మలఁది

పాండురంగు నైనైవన్నియలఁ గుల్కు
కలితెంపుమణులఁ గెంజల్వలు ధరించి

గీ. కప్పురపుఁదావి చికిలి బాగాలొసంగ
నెఱపుక్రొత్తలు తెలనాకుమడుపు లొసఁగ
సంతియలు ప్రోయ నాస్థాని కరుగుదెంచి
రంగు లలి కంతుపట్టంపుబంతు లనఁగ. 73

క. భూనాయకునకుఁ గొలువిచ్చి హ
జారమ్మున నుండునట్టి సమయ మెఱిఁగి యొ
య్యారంబున నభినవశృం
గారంబులు మెఱయఁ జని ప్రగల్భత విటుల్. 74

మ. విసబింబాస్యలు గాంచి యున్నత పలద్వీచీసముద్యద్విలా
సనురాంగల్లవకేళిసారమది నాసద్వృద్ధిక్షీరనీ
రసనిశాసచిరప్నుగస్న రశనాడాజశ్కుటిస్ఫారవి
శ్వథరారకుణవకుచక్షీణభుజవ్యాళేంద్రుఁ జోళేంద్రునిన్ 75

వ. కని వసంతసమయ పికస్వరపికస్వరమాధురీరమాధురీణనిర్ఘాటచా
టువాగ్వైఖరీసుధాసారంబు తత్సభాగారంబున దైవారఁ గైవా
రంబుఁ గావించి తదీయ నిర్దేశంబున నుచితప్రదేశంబున నాసీనలై,

చ. సవరని వీణెఁ గైకొని భుజంబున నొండొక కాయయు న్నిజాం
కవసతి నొక్క కాయయుఁ దగం బొసఁగించిన రెంటి సందునం
గువలయపత్త్రనేత్రకుచకుంభము పొల్పుధృతోత్తరీయ మై
గవిసెనతోడికాయగమకంబునఁ దత్సదృశోజ్జ్వలాకృతిన్. 77

సీ. శ్రవణసంకుమదంబు సంధించి మునువ్రేల
మృదురీతి నైఁ దీఁగె మెఱుఁగు సేయు

శ్రుతులు విజ్ఞోడైనచోఁ దంత్రి బిగువుగాఁ
బీడించి గిటగిట బిరుడఁ ద్రిప్పఁ
గోటనూనంబుగాఁ బాటలోపలఁ గేలఁ
జిటిపెట తాలంబుఘటన నడుపుఁ
జరగించు నప్పటప్పటికిని గద్దెపై
గాంటసం బైన క్రేఁగంటిచూపు

గీ. పోసఁగి నిజహస్తములను నింపాలయఁ జిత్ర
భంగి వినిపించు గీతప్రబంధతతులు
చేతనాచేతనములు సంప్రీతిఁ గరఁగఁ
జంచలేక్షణ వీణె వాయించు నపుడు. 7

క. ఏణాయతలోచన స
ప్రాణాయతచిత్రగాత్రపాంచాలిక యై
వాణియ యీరూపో యన
వీణియ వాయించె నాగిఁ బ్రవీణత మెఱయన్. 7

వ. అంత నమ్మహీకాంతుం డెంతయు సంతసిల్లి యయ్యింతులకుఁ గూఁ
గూరలొసంగి విడుదల కనిపిన నమ్మనురవాణి యిట్లనియె. 8

ఉ. బాలిక రంగశాయిగుడిపాత్ర నృపాలవరేణ్య నీవు మా
పాలికి రంగశాయివి కృపామతి నానతి యిమ్ము మాపురం
గేలికి నృత్తమున్న నృపకేసరి యట్లు యొసంగ భూమిభృ
న్మాళికిఁ గేలు మోడ్చి చని మాపటికొల్వున నావిలాసినుల్. 8

వ. నర్తనసన్నాహంబునకు ననుకూలం బైన మేళంబుతోఁ జనుదెంచి
నృపాలునిం గాంచి నిజోచితస్థానంబున నిలిచిన. 8.

చ. అరుదుగ వాద్యవిద్య బిరు దందిన వాదనకారు లత్తఱి
స్థానములు రెండు నొక్కసరిగా మురజంబులు ముట్టి దిమ్మన
న్మెరయఁగఁ జేసి కాంస్యరవము ల్సెలగ న్నియతావధాను లై
సరి వినిపించి రుక్తగతిఁ జంచుపుటాదిముఖ్యతాళముల్. 83

వ. అంత. 84

క. రంజితపదమంజీరక
శింజితము సెలంగ రంగసీమ నిలచి పు
ష్పాంజలియు వసుమతీపతి
కంజలియు నొసర్చి సభ్యు లభినుతి సేయన్. 85

క. లోలసమీరకిశోరక
లాలసవిస్ఫూర్తక్రియాచలాచలదీప
జ్వాలిక పోలిక నిలచె
న్బాలిక నృత్యాదిఁదత్సభాగారమునన్. 86

వ. ఇట్లు నిలచి, 87

మహాస్రగ్ధర. తవణింపన్ ముమ్మరంబై తవణిమలహరుద్ధాకితాడంబరస్ఫూ
ర్తి విజృంభింపంగ రంగోర్విని బిరుదు పచారించి రచ్చాటుకారుల్
హావుదప్పా పాత్రరాయా యహహా బళిబళీ యంచుఁ బెల్లుచ్చరింపన్
రవలి న్స్ఫూర్తించెఁ గాంస్యారవ మురజముఖారావభావానువృత్తిన్

సీ. నాగస్వరంబు గానము భుజంగియుఁ బోలె
గీతమంగళము నంగీకరించి
హస్తవిన్యాసప్రశస్తవిభ్రమముల
నయ మొప్ప నర్థాభినయముఁ జూపి

వివిధవీక్షణవిలాసవిచిత్రనటనలఁ
పాటించి భావంబు తేటపఱచి
చరణనూపురఘణంఘణనినాదంబులఁ
దాళమానము దీపితంబుఁ జేసి
గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు
కోపుకోపున దొర లెల్ల దోపు లొసఁగ
నాయకుఁడు బాపురే బాపురే యటంచుఁ
గట్నములు సైఁడికోర భాగాలు నంప. 89
వ. అంత. 90
సీ. సవ్యహస్తం బర్ధచంద్రాభినయముతోఁ
గా నంటి కటిపట్టిఁ గదియఁ జేర్చి
కొనగోళ్ళ నుదుటఁ గ్రమ్మిన చెంజెమట మాటి
మాటికిఁ దిగిచి షో మీఁటికొనుచుఁ
జనుకట్టు విప్పఁ జుట్టును ఘనస్తనకాంతి
జల్లించి యుగము పై వెల్లి విరియఁ
గోపఘూర్ణిత మైన కొండను నాగము వోలె
నలఁతి నిట్టూర్పు లందంద నిగుడ
గీ. నలస వళితంబు లైన కటాక్షవీక్ష
ణాంచలంబులు యువధైర్య కంచుకములు
చించి చీకాకు పఱచి విసంచుఁ జేసె
రామ నర్తనకేళి విరామవేళ. 91
మ. అపు డా చోళవసుంధరాధిపతి నానానర్ఘ్యభూషాంబరా
ది పదార్థప్రకరంబు త్యాగమహిగా దీనారము ల్వేయునూ

ఉపదాల్పుం గృపచేసి పంపినఁ బ్రహృష్టస్వాంతలై కాంత లా
న్నృపతిం గేలు మొగిడ్చి వీడుకొని నిర్నిద్రప్రయాణంబులన్. 92

గీ. నిజపురంబుఁ జేర వచ్చి తన్నికటభూమి
నిపులతర నైన యొక వటవిటపినీడ
నొంటఁగడి శాంత మగు నాఁక నుండె రచట
నచటఁ బ్రమోదన ముచ్చట లాడుకొనుచు. 93

## ఆశ్వాసాంతము.

చ. తరణికులీన! లీనవసుధాసురనందన జీవమార్యశో
ద్ధరణ ధురీణ! కీర్తిసురధామ ప్రసన్నపరిపూర్ణమోదితా
పరిమితపుణ్య! పుణ్యజనభంజన! భంజన బద్ధకంకణ
స్ఫురదురుభుజాగ్ర! జాగ్రదపబోధసుఖామృత సింధుబాంధవా. 94

క. వివిధకిరీటధర పదప
ల్లవసేవానిరత భరత లక్ష్మణ శత్రు
ఘ్న విభీషణ రవినందన
పవనజ యువరాజముఖాప్తపరివారజనా. 95

మాలినీవృత్తము.

దశరథకులదీపా ♦ తథ్యపథ్యానులాపా
విశదగుణకలాపా ♦ వేదవేద్యస్వరూపా
యశరణగణగోపా ♦ హవ్యవాహప్రతాపా
సశరశరధిచాపా ♦ సాగరోత్పన్నకోపా. 96

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర
శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగు నృసింహ
మంత్రితనూభవ పరిచిత భగవద్భాగవతకైంకర్య
విధాన తమ్మయాభిధానప్రణీతం బైన
వైజయంతీవిలాసం బను మహా
ప్రబంధంబు నందుఁ
బ్రథమాశ్వాసము

# వైజయంతీవిలాసము

## (విప్రనారాయణచరిత్రము)

---

### ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీమదయోధ్యాపురవీ
థీమానుష విగ్రహాప్రతీతాశ్రిత లో
కామితఫలదాయక సౌ
త్రామణి ధరణీయహేంద్ర రఘుకులచంద్రా. 1

వ. అవధరింపు మంతః ప్రొద్దు చల్ల నగుటయు మేళంబు సాగం బనిచి యారామ లా రామలక్ష్మీప్రియాళు లగు ప్రియాళులు సవంధ్య సౌగంధ్యవాసిత సమీరణంబు లగు సమీరణంబులు ననవరత మధువ్రత సక్తకీన రతన ఖేలనాగరంబు లగు నాగరంబులును నవనీతల సురసాలంబు లగు రసాలంబులును నతిపృథులఫలాపహాసితవనితాలికుచంబులగు లికుచంబులును నమృతమయూఖశేఖరస్వీకృతమాలంబులగు తమాలంబులును నార్యాశిరోధార్యఘన సమమాలిక లగు నవమాలికలును నంగనాజనకర్ణపూరంబు లగు కర్ణపూరంబులును నాత్మీయకుసుమమాలికా వికాసోపమాన మేరువు లగు నమేరువులును నభినవప్రసూన దామవ్యామోహిత యువకులంబు లగు వకులంబులును నాదియైన మేది

నీరుహంబుల భానుమంతుని కిరణంబులకుఁ బ్రవేశంబు లేక త్రైలో
క్యజైత్రయాత్రాసమారంభ విజృంభమాణ సేనాడంబరాడంబరారి సు
హృద్వ్యానం బగు నుద్యానంబు నవలోకించుచుఁ జని చని. 2

సీ. అనిమిషాధీసు నందన వనంబునుఁ బోలె
మందార కల్పద్రుమ మహిత మగుచు
బాణవైరికుమారు తూణీరమునుఁ బోలె
నవపుష్పకాండ సనాథ మగుచు
వనజనాభుని సుదర్శనచక్రమునుఁ బోలె
దివ్యబృందావనోద్దీప్త మగుచు
గగనగంగాతరంగప్రవాహము వోలె
నవిరళామృత ఫలోదార మగుచుఁ

గీ. ప్రోషితదివ్యవధూముఖాబ్జమునుఁ బోలెఁ
జారుతర కీర మనువాక్ప్రచార మగుచు
నలరు న వ్విప్రనారాయ ణార్య పుష్ప
వాటి సంకల్పభవ పటవాసపేటి. 3

వ. కాంచి యందుఁ బ్రవేశించి తన్మధ్యప్రదేశంబున. 4

## దేవదేవీమధురవాణులు విప్రనారాయణుదర్శించుట.

సీ. ప్రతిమాస వపనముండిత మైన మస్తంబు
పెడతలఁ దూలాడు పిల్లసిగయుఁ
దులసి నెత్తమ్మిపూసల గొప్పపేరులు
విపులరంధ్రము లైన వ్రేలుఁ జెవులు

నడువీధి గల నిల్వు నామంబు పట్టెలు
శోభితం బగు తిరుచూర్ణ రేఖ
వెన్నాలి త్రాటఁ గీల్కొన్న కౌపీనంబు
విశదంపు నీర్కావి వేష్టనలును
గీ. గలిగి పద్మాసనస్థుఁడై కన్ను మోడ్చి
భగవదారాధనైక తత్పరత నున్న
శ్రీమ దష్టాక్షరీమంత్ర చింతనా ప
రాయణుం డైన విప్రనారాయణుండు. 5

వ ఇట్లున్న. 6

క. కాంచి యనుష్ఠానము ముగి
యించి యరుగునట్టివేళ నెదుట నిలిచి యా
చంచలలోచన లతనికిఁ
గించిద్భాగమునఁ జే మొగిచి మ్రొక్కుటయున్. 7

క. చందురుఁ గను నరవిందము
చందంబున మోము వంచి సంయమికుల సం
క్రందనుఁ డారామద్రుమ
బృందము నడుచక్కి నపు డుపేక్షం జనుఁడున్. 8

వ. అప్పు డద్దేవదేవి యగ్రజ కిట్లనియె. 9

ఉ. మ్రొక్కిన నెవ్వ రే మనఁడు మో మటు పెట్టుక చక్కఁ బోయెనీ
దిక్కును జూడఁ డాయె నొక దీవనమాటయు నాడఁ డాయె వీఁ
డెక్కడి వైష్ణవుండు మన మేటికి మ్రొక్కితి మమ్మ యక్కటా
నెక్కొని వెఱ్ఱిబుద్ధి మయి నిద్దుర వోయిన వాని కాళ్ళకున్. 1

వ. అని యిట్లు నిరాకరించి పలుకు న ద్దేవదేవిం గనుంగొని మధురవాణి యిట్లనియె. 11

ఉ. చూచిన నేమి నీవలను చూడక యుండిన నేమి పూజ్యులం
జూచిన భక్తి మ్రొక్కుటయె శోభన మీతఁడు బ్రాహ్మణుండు ధా
త్రీచరులందు బ్రాహ్మణుఁడు దేవుఁడు దేవుఁడు నీవు మ్రొక్కినన్
జూచునొ పల్కునో యటుల సుమ్మితఁడు స్సరసీరుహాననా. 12

ఆ. బ్రహ్మచర్యమును జపంబు నధ్యయనంబు
హరిదినోపవాస మచ్యుతాంఘ్రి
చింతనముఁ దదీయ సేవానురక్తియు
సుపటి జగతి నితని సొమ్ము సుమ్ము. 13

మ. లలనా యీతఁ డశోకవృక్షము రసాలంబు బ్రియాళంబు వా
విలియుం బొన్నయు బొట్టుగు న్బొగడ క్రోవిన్ గోఁగుసంపెంగనిం
దులఁ బోషింపఁడు దోహదంబునకు నింతు ల్వత్తు రన్వంక ని
ర్మల మింతిం తన వచ్చునే యితని వైరాగ్యంబు భావింపఁగన్. 14

వ. అనిన మందస్మిత సుందర వదనారవిందయై యయ్యిందువదన యగ్రజ కిట్లనియె. 15

చ. ప్రకటజితేంద్రియుల్ ధరఁ బరాశర కౌశికు లంతవారు స్త్రీ
లకు వశు లంతికంబె మిగులం దృఢనై మగకచ్చ బిగ్గఁ గ
టుకొనఁగ నీతఁ డెంత శుకుఁడో హనుమంతుఁడొ భీష్ముఁడో వినా
యకుఁడొ తలంచుకో సరసిజాయతలోచన నెమ్మనంబునన్. 16

క. ఈనిష్ఠ లింతి తారస
మైనం దాఁకయునె నూ సదాచారి యటం

జే నబ్బిన నాకయు నను
మానిజన పిడంబనములు మన మెఱుఁగనివే. 17

క. ఇటువంటియ్యాలె కాగా
చిటుకు మనక యుండ సందెచీఁకటివేళ౯
సుటచేటీపిటు లై యి
క్కుటకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ 18

గీ. కదసి గాఢ ఘోటకబ్రహ్మచర్యంబు
పంగళాజపంబు పిల్లిశీల
మజగరోపవాస ములబకధ్యానంబు
నక్కవినయ మిట్టి నయము లెల్ల. 19

సీ. ముగ్ధేందువదనలముఖవిలాసములనుఁ
జిగురుఁబోఁడులనుచాశ్లేషములను
మహిళాజనంబులమధురభాషలకును
వనితలనిశ్వాసవాసనలకుఁ
గలకంఠకంఠులకలికిచూపులకును
బాటలగంధులపాటలకును
మత్తేభయానలమందహాసములకు
మగువలవాతెఱమధువులకును

గీ. నంగనలపాదహస్తవిన్యాసములకు
వెంటఁ బరువెత్తు మునివనవృత్తితతులు
విషయసౌఖ్యస్వరూపవివేకి యైన
నరుఁడు వశుఁడౌట యేమి యచ్చెరువు జగతి. 20

క. కిలికించితరసపూరముఁ
జలికించి కటాక్షవీక్షచే నలినాక్షుల్
తిలకించి చూచినప్పుడు
పులకించక నరులదేహములు లోహములే. 21

శా. శ్రీరంగేశునకు న్సదా యితఁడు పూచేరుల్ సమర్పించు టా
హారార్థం బగుఁ గాని పూని సహజం బాదేవతాభక్తిఁ గా
దారామంబునఁ గూలి కెవ్వ రిటు సేయం బంచిరో యీయప
స్మారభ్రాంతిమదాత్మశీలి యన నే సమ్యగ్వచోవైఖరిన్, 22

వ. అనినఁ జెలియలికి నప్ప యిట్లనియె 23

శా. నీరేజాయతనేత్ర నిందితముగా నీవాడిన న్నీదు జి
హ్వారంగంబున నున్న శారద యసత్యం బాడఁగా నేర్చునే
స్మారభ్రాంతిమదంబు లేదితని కెంచన్ ధాత్రిఁ గాఁగా నప
స్మారభ్రాంతిమదాత్ముఁ డంచుఁ బలికె న్సమ్యగ్వచోవైఖరిన్. 24

వ. నావుడు నద్దేవదేవి కనుంగొని. 25

గీ. నిర్జితేంద్రియుండు నిష్ఠాపరుం డంచు
నప్ప సారెసారెఁ జెప్ప దీవు
నీనిఁ బ్రతిన చెఱిచి విటుఁ జేసి తెచ్చిన
గలదె పందె మనినఁ గాంత పలికె. 26

క. నీవే కా దప్సరలో
నేవేశ్యాపుత్త్రి యైన నీతని విటునిం
గావింపఁ జాలె నేనియు
నావేశ్యకు నీళ్ళుఁ గట్టియలు నే మోతున్. 27

వ. అనిన దేవదేవి యిట్లనియె. 28

గీ. అప్పుడో నీవ నేఁ గట్టియలును నీళ్ళు
నెంటె మోఁచినఁ గాని నా కెగ్గు లేదు
నిన్నుఁ బనిఁగొనఁగా నాకు నీతి కాదు
నేఁడు పన్నిద మొకటి గావింపు మనిన. 29

క. ఏ నీ నైష్ఠుపు విటునిం
గాఁగించిన లంజెతనపుఁగడన విడిచెదన్
గావింప లేక యుండిన
నీవు న్విడిచెదవె యనిన నెలఁతుక యొప్పెన్. 30

క. తరుణీమణు లిరువురు నీ
కరణిం బన్నిదము నుడివి క్రమ్మఱ లీలా
సరణిం బురికిం జేరిరి
తరణియుఁ బశ్చిమపయోధిదరికి జ్జేరెన్. 31

## సూర్యాస్తమయ వర్ణనము.

క. పెరిగినచీఁకటి తనుఁ గని
సురిగి యరిగి వరుణునగరుఁ జొచ్చిన దానిన్
జొరఁ గొన వెంబడిఁ దానును
నెరిగినక్రియ నినుఁడు గ్రుంకె నపరాంబుధిలోన్. 32

గీ. ధాత్రి దినరాజు విడిచి పాతాళమునకుఁ
జనుచు వేలంబు వెలుఁగఁ జేసిన వెలుంగు

చాయ నెఱసంజ యొప్పెఁ దదీయధూమ
పటలమును బోలెఁ జిమ్మచీకటులు మించె. 33

గీ. అంబరారణ్యమునఁ బ్రవృద్ధంబు లైన
ఘోరతిమిరతమాలభూమీరుహముల
దట్టముగ నల్లుకొని ప్రాచి నట్టి మొల్ల
విరులు నాఁ బొల్చెఁ దార లయ్యిరుల యందు. 34

గీ. వెట్టిచెఱకుఁగోలవింటిబద్దకు మల్లె
తీవె నారిఁ జేసి భావభవుఁడు
తలుమ పువ్వుఁబోండ్ల పెఱచోటు లుమ్మెత్త
విరులతూఁపు లేసి మరులు కొలిపె. 35

వ. ఆ సమయంబున, 36

చ. పరువడి జారకామినులపల్కులు జారులకుం దదీయవా
క్సరణులు జారకాంతలకు సమ్మతిగా వినుపింపుచుంబొరిం
బొరి నుభయానురాగరసపోషణు లై వెస నిందు నందునుం
దిరుగుదు రాసుఁ గోవులగతిం బురవీథుల శంభళీసతుల్. 37

ఉ. కుట్టనికానివేశములు గోష్ఠతలంబులు తక్కరీసుపుం
దెట్టెలు పాడుగోడలు నదీసదనంబులు నిష్కుటంబులుం
గట్టికుటీరము ల్పసులగాడిమఱుంగులు గచ్ఛపంచలు
నట్టనియిండ్లు జారరతికార్యసమాచరణైకసిద్ధికిన్. 38

వ. తత్ప్రదేశములందు, 39

మ. అనుగంధాంగవిలేపనం బనఘకంఠాంకం బతాంబూల మ
ప్రసవాలంకరణం బనుత్తమణిహారాకం బశయ్యాతలం
బసుఖస్వాప మబంధనైపుణ మసంప్రాప్తాంగ సంక్షాళనం
బసిధారావ్రతము నైన జారకతికిన్ బ్యాం బత్తుటిన్వర్తిలెన్ 40

మ. తనువై రేయెలినవారి నిత్యగృహకృత్యం బంతయుం దీర్చి తేఁ
కువతో నింపైన వచ్చునప్పటికిఁ బెన్కుల్ రూకలున్ రెండుమూఁ
డు పిల్లాపలు పోకలూని విడివాటున్ గోడలై తత్కుటీ
భవనప్రాంగణసీమఁ ద్రిమ్మరుచు రంభాకుంభ చేటీకిటుల్. 41

క. అపతిఁ బ్రహ్లాదసమ
న్వితం బై కుశలయంబు విలసిల్లె సమ
న్యోత సకలాపటలంబై
శీతాంశుఁడు పొడిచె నారసింహుఁడు పోలెన్. 42

గీ. దితిజరక్తారుణనృసింహదివ్యమూర్తిఁ
బోలి యొప్పారెఁ బొడుపుఁ గెంపున విధుండు
తద్విశాలాంకతలదైత్యతనువు వోలె
లాంఛనం బొప్పె నమ్మండలంబు నందు. 43

చ. అనిమిషమండలీవిరచితాభ్రధునీసలిలాభిషేచనం
బున విమలాంగుఁడౌ నృహరిపోల్కి సుధాకిరణుం డనంతరం
బునఁ దెలు పొందెఁ దత్సలిలపూరము రోవసిఁ బిక్కటిల్లెనో
యన బలితంపువెన్నెల లజాండవిభాగము నిండె నత్తఱిన్. 44.

సీ. చెలువ గట్టిన చీర మొలఁ గొంటెఁ గట్టి యా
సగము పైవల్లెవాటుగ నమర్చి

పసిఁ బూని రేక దిద్దినకన్బొమల నంటఁ
గమ్మతావులకదంబమ్ము నలఁది
లీలగా నూరుగోరూర్మ్రలభాగమ్ములు
వాసించుగోవజవ్యాదిఁ దుడిచి
తమరాక ప్రియల కెంతయు దౌల వినరాఁ బి
సాళించుకిఱ్ఱుపాగాలు మెట్టి
గీ. చుట్టుపువ్వులసిగలు కస్తూరిబొట్లు
సందితాయెతులును జెంపగందములును
గలిగి సవయస్కులగు కోడెకాండ్రఁ గూడి
విటులు విహరింతు రవ్వీటి వేశవాటి. 4.

వ. మఱియును. 4

సీ. అలకము ల్మాటి యాదలఁబాగఁ జుట్టి పై
నడ్డకట్టురుమాలుగడ్డఁ గట్టి
చెవుల కమ్మలపట్లఁ జవుకట్లు మేలినీ
లాలపోఁగులజోళ్ళు గీలుకొల్పి
యరచట్ట దొడిగి పై నడ్డంబు దిగటంబు
వలిపెదుప్పటి వల్లెవాటు వేసి
నిటలభాగము నందు నిడుసోఁగ తీరుగా
మల్లెపూమొగ్గనామంబు దీర్చి
గీ. ద్రవిడపరిచారకులు వోలెఁ దరుణవేశ్య
లడపములు పూనిరాఁ గొంద ఱవ్వెలంది
వెన్నెలల నారజపుఁబీఁకవన్నె లలరఁ
గంతుగురుపల్లకీసేవ గాంతు రందు. 4

ఉ. కొందఱు సూర్యకాంతశిలకోమలసైకతవేదికావలిం
గొందఱు చంద్రకాంతమణికుట్టిమకేళిగృహాంగణంబులం
గొందఱు మందిరోపరిక సుప్పరిపాలితవృక్షవాటికా
ళిందముల స్మరోజసుఖలీలలఁ దేలిరి వార లత్తఱిన్. 48

ఉ. తూరుపు తెల్లవాఱె శశి తోయధిపాశకుఁ జేరె వెన్నెల
ల్తారలతోన జాఱెఁ గుముదంబులు నిద్రలఁ గూరె జక్కవల్
గేరెఁ బ్రసూనసాయకునికి న్బని దీఱె దిగంతరంబులం
జారెఁ జకోరసంఘము ఉదారత మీఱెను సాంధ్యరాగముల్. 49

వ. అంత. 50

## సూర్యోదయ వర్ణనము.

మ॥స్ర. ఉదయక్షోణీధరాధ్యాధ్యుషితపిశితభుగ్యూథయూథాగ్రహారోద్య
త్కృదనత్స్వాదేవదత్తాగ్ర్యజలకులిశసంఘాతపాతక్షతత్రా
జ్యద్వక్షోదేహదేహక్షుగదురుతరరక్తప్రభామండలీకం
బుదయించెన్ భాస్కరుండత్యుడుపరిబృహసద్ద్యోతశోభాకరుండై.

క. అప్పుడు. 52

గీ. విప్రనారాయణార్యుని విటునిఁ జేసి
తెత్తు నని పంత మాడినదేవదేవి
కనకమణిభూషణసుగంధగంధమాల్య
సుపటశృంగార మెడలించి కపటలీల 53

## దేవదేవి విప్రనారాయణుకడ కేఁగుట.

సీ. నడిముక్కుమీఁద నస్నపునాభినామంబు
నడుమ మంజలికావినిడుదరేఖ

యాలఁతిపీనుల విచ్చుటాకులదుద్దులు
సిగవేసి ముడిచిన చిన్నితుఱుముఁ
జనుదోయి నిఱియఁ గట్టిన చుట్టుపయ్యెద
క్రొత్త దోమిన దంతకోరకములు
త్రికముపై నెగఁగట్టు దిగఁగట్టు దువ్వల్వ
నేలపైఁ జీరాడు వ్రేలుఁ గచ్చ

గీ. కంఠపార్శ్వంబున సగంబు గానిపించు
తులసితామరపూసల వలుదసరులు
పూని నిక్కంపుదాసరి సానివోలె
విప్రనారాయణారామవీథిఁ జొచ్చి 54

వ. తదీయ మధ్యప్రదేశంబునందు. 55

క. అమ్మగువ గనుంగొనియెన్
ముమ్మరముగఁ బట్టెనామములు మైనెల్లం
గ్రమ్మికొన నుట్టిఁబెట్టిన
గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్నతనిన్. 56

గీ. విప్రనారాయణుని మాల్యవిరచనావ్య
సనపరాయణుఁ జూచి యచ్చటనె పుడమి
నుదురు సోఁకఁగ మ్రొక్కి యయ్యెదుట మోడ్చుఁ
గేలితో నున్న వెడదాసురాలిఁ జూచి. 57

క. ఎయ్యది కుల మెయ్యది నెల
వెయ్యది నీ నామధేయ మిచ్చోటికి రా

నెయ్యది ప్రస్తుత మనినం
దొయ్యలి యా బ్రహ్మచారితో నిట్లనియెన్. 58

చ. అకలుషమైన తావక వనాశ్రమభూమికి శంక లేక హీ
నకులుల కెట్లు రాఁ దగు మనంబున నుంచకుఁ డట్టి దేను శూ
ద్రకులముదాన నందును వితంతునుగా నొకరింట దాసిఁ గా
నొకమగనాలిఁ గాను వగ లొం డెద లేదు తనంతమానిసిన్. 59

సీ. ధర వర్ణముల కెల్ల గురువు బ్రాహ్మణుఁ డని
యఖిలశ్రుతులు బల్కు నదియ కాదు
బ్రహ్మనిర్మితమైన పరమధర్మము శూద్ర
జాతికి బ్రాహ్మణ చరణసేవ
యట్టి బ్రాహ్మణులందు హరిభక్తులు త్రిలోక
పావను లాహరిభక్తులందు
వైష్ణవుల్ ఘనులు శ్రీవైష్ణవజనులందు,
విజితేంద్రియుండు శ్రీవిష్ణుమూర్తి
గీ. యిన్ని గుణములు గణుతింప నిపుడు స్వామి
వలనఁ గల వని మీతిరువడిశుశ్రూ
యింప వచ్చితి నను గటాక్షింపు స్వామి
నాథ రెవ్వరు లేని యనాథ ననిన. 60

ఆ. తల్లి దండ్రి యన్న దమ్ము లెవ్వరు లేక
యొంటి నింటి నుండి యుట్టిపడితె
యింతి యింతకాల మొందుంటివి విరక్తి
కిని నిమిత్త మేమి యొనరఁ జెప్పుము 61

వ నావుడు నయ్యతివ యిట్లనియె. 62

శా. స్వామీ యే మని విన్నవింతు నతికష్టంబైన నాజన్మ మీ
భూమి న్నేఁ బడినట్టిపాట్లు శునకంబుల్ సూకరంబు ల్మహా
గ్రామున్ పడ్డది లేదు మీరనఁగ సాక్షాద్రంగనాథుండు చో
ద్యో మీముందఱఁ జెప్పినన్ దొలఁగు మద్దోషంబు నిశ్శేషమై. 6

వ. ఆకర్ణింపుము. 6

సీ. వెలయు నేవీడు నిర్మలధర్మమహిమచే
ధాత్రి సత్యవ్రతక్షేత్ర మనఁగఁ
బ్రవహించె నెందు వేదవతి పేరఁట బ్రహ్మ
దేవునింతి సరస్వతీస్రవంతి
కావించె నెచట నిష్కామధీమహితుఁడై
హరిఁగూర్చి విరించి యధ్వరంబుఁ
జవి నూచె నెచ్చోట సవనాగ్నిహుతమహా
హుతిహావిస్సార మబ్జోదరుండు
గీ. కటకమాత్రంబె యది విశంకటజలగ్ర
హగ్రహణవిగ్రహోయస్తహస్తివరద
చిరదయావాల మోక్షలక్ష్మీవిశాల
కటితటీనూత్నకళ్యాణకాంచి కాంచి 6

వ. అందు. 6

సీ. కలహంస కర్పూర కలిక పద్మావతి
మందారవల్లరి మధురవాణి
సౌందర్యలహరి పుష్పసుగంధి చిత్రాంగి
కాంచనమాలిక కనకరేఖ

రాజమోహిని హేమాంగస్వాతి సుశీల
మదనాభిరామ మన్మథకతారి
మంజుభాషిణి భానుమతి రమాతిలకంబు
కామమంజరి చంద్రకళ యనంగ
గీ. భూమిసలిలాగ్ని పవనార్క సోమకామ
సిద్ధిసుధాసమునితటిద్వ్యుబుధమత్స్య
కనిక లగు నప్సరలకును జననమొంది
వారసతు లుంద్రు సాశృంగారవతులు. 67

గీ. అందు నొకవారసతిపుత్త్రి నై జనించి
వృద్ధిఁ బొందితి దేవదేవి యను పేర
నభ్యసించితి బాల్యంబు నందు నృత్య
వాద్యసంగీతసాహిత్యవిద్య లెల్ల. 68

మ. ఎలమిన్ శైశవయౌవనాంతరవయోహేలావిలాసంబు నై
నలమన్ గన్గొని జ్యోతిష్యు లిచ్చిన శుభోదంచన్ముహూర్తంబునన్
జెలిమిన్ భూసురవృద్ధబాంధవజనాశీర్వాదపూర్వంబుగాఁ
బలిమం బెక్కఁగఁ జేసెఁ దల్లి నను నుద్యన్మోదమత్తల్లి యై. 69

క. క్రొన్ననవిల్తుఁడు నాకను
సన్నల వర్తిల్లు సురతసామ్రాజ్యగతిం
గన్నెతికంబుల వలపుల
మన్నెతికం బెఱిఁగి విటుల మహి నేఁ గొందున్. 70

ఉ. పంకజనాభు హస్తిగిరిభర్త భజింపఁగ వచ్చి నాకు నా
తేంకణకోంకణద్రవిడదేశనృపాలకు లంటుకాండ్రు రై

కంకణముద్రికాళి కయి కానుక లిచ్చి వసింతు రింట నా
యంకణభూమిఁ బల్లకులు నందలముల్ పడిగాఁపు లుండఁగన్. 71

ఉ. కిట్టున సొండ్లొకళ్ళు తమకే తమకే పిలు పంచుఁ బైపయిన్
గొట్టెలు పాడిపైరములు కోకలు రూకలు ముందుముందుగా
నట్టుగ నిచ్చి వచ్చి తలవాకిలిఁ గాతురు రాతిరిం బగల్
గట్టువయస్సుమల్లర పుఁగోఁడెలు సైరికరాట్కుమారకుల్. 72

గీ. వైష్ణవోత్తమ మీవంటివారి యెదుట
నాత్మసంస్తుతి నీతిగా దైనవినుము
నాఁటి దినముల యందు మన్మందిరమున
సంతతంబును గనకవర్షంబు గురియు. 73

గీ. అట్టిగడన విడిచి యవని భిక్షావృత్తి
నేల తిరిగె దంటి వేని వినుము
నలువసృష్టిఁ గలుగు కులములలో నెల్లఁ
గాకులంబు లంజికాకులంబు. 74

సీ. అర్థప్రమోషణాయత్తంబు చిత్తంబు
బహువృషాభాషణాభ్యసన రసన
యాజన్మపశ్యతోహరములు కరములు
ప్రచురహేయాశనభక్షి కుక్షి
సంతతాన్యాయప్రచార మాచారంబు
మతకంపుమాయలమనువు తనువు
సకలవర్ణోచ్ఛిష్టసదనంబు వదనంబు
వితతకుతర్కాభివృద్ధి బుద్ధి

గీ. అంగజవ్యాధిఁ గడుపుబ్బినట్టి విటుల
యాత్తజలపూరముల లెట్టు వల్లపట్టు
హేయభాజన మెన్నిట నెన్ని చూడ
వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య! 75

చ. ఎటు గణుతింప యోజనము! లేఁబదికోటులు భూమి దీనిలో
నటు తుహినాచలేంద్రమున కవ్వలి వన్నియు దేవభూములే
యిటు హిమసేతుమధ్యమున నెందులఁ దాఁ బరికించి చూచినన్
విటులకు సత్యశౌచములు వేశ్యకు నేమము లే దొకింతయున్. 76

ఉ. ఒక్కని బిల్వనంపి మఱియొక్కనిచేతఁ బసిండిఁ బట్టి వే
ఱొక్కనియింటి కేఁగుచు మఱొక్కని నానడుచక్కి నొక్కుచోఁ
బొక్కుచునుండి కూడ భ్రమఁ బొంది విటుల్ దెలియంగ లేరు గా
కెక్కడి సత్య మేడ వల నెక్కడి నేమము వారకాంతకున్. 77

ఆ. మమత మూఢవిటులు బ్రమతు రింతియె కాక
వెలపొలంతి కెందు వలపు గలదె
సజ్జ గలిగె నేని తజ్జాతి వలపును
జాతివలపు నొక్కరీతి దలఁప. 78

ఉ. మేఁతలు మాంసముం జమురు మెత్తనియన్నము గట్టిపెర్వునున్
బూఁతలు గంధముల్ కపురమున్ మృగనాభియుఁ గాక వేశ్యకున్
మేఁతలు పూఁత లన్నవి గణింపఁగ మందులె తారు మందులై
చేఁతలు కూచిమారములు సేయుదు రింతియ కాక దుర్విటుల్. 79

క. సద్యోవశీకరణజన
హృద్యశుభాకారవిభవ మెన్నఁగ నేలా?
ప్రద్యుమ్నుఁ డైనవాఁడే

ప్రద్యుమ్నుఁడు జగతి వారభామల కెందున్ ౮౦

చ. తలనిలువర్ధ మిచ్చినను దాము కులస్థులు కాని హీనులన్
బిలువ మటన్న నేమములు భేషజముల్ వెలయాండ్రు పిల్తు రే
కులజాల నైన మున్ను తమకుం బ్రకృతంబుగ నిచ్చు నట్టి రో
వెల కధికంబు నొక్క యరవీసము కాసును జేతి కిచ్చినన్. ౮౧

క. ఆపల్కు లాలకించినఁ
దీపాల్కుచుఁ గురియుఁ గమ్మదేనియసోనల్
లోపలఁ బరికించిన నీ
లోపల సదృశములు వారయోషాతతికిన్. ౮౨

గీ. ఆవల రోవట్టి యెంతశే ద్దైన నిద్ర
గూఁతుఁ బోనీదు షోకాకు గొఱుకు కొఱకు
నాఁడవశ్యంబుఁ బిలిపించు ననుపు విటులఁ
దల్లి యల్లుండ్ర పెడబూచి ధనపిశాచి ౮౩

సీ. మునుపు జంగాలఁ జేసిన భుజంగులఁ గన్న
గర్జించి శునకమై కఱువ వచ్చుఁ
బెట్టాకించుక తీసి కట్టైనఁ బట్టిచే
దట్టించు విటునిఁ గందర్పు నైనఁ
బాదదక్షిణచేతఁ బడినఁ దజ్జామాతఁ
బ్రణుతించు విటశిఖామణి యటంచు
ధనవంతుఁ డైన మెత్తనివాఁడు చేరినా
పుత్త్రిక కొప్పించుఁ బోటివిటులఁ

గీ. బయిసిమాలించుఁ దన పిన్నవయసు నాఁటి
పడుపుసుద్దులు దలపెట్టి పాఁతజోలి

నోరు విడివడ్డఁ బచ్చిబూతే రచించు
వివిధమాయామదోపేత వేశ్యమాత. 84

శా. ఏవేళ న్మతి యేముహూర్తమున మా యిల్ చొచ్చినాఁడో మనో
భాగ్యుండయి సర్వము న్నడుపు నాబంగారుకాళ్ళయ్య జే
జే వెయ్యేఁడులు రాజ్యమేలు మనుచున్ జేమోడ్చు నీరీతి మా
యావాదంబులచే ధనం బొలుచు వేశ్యామాత జామాతలన్. 85

ఉ. ఈ విట గమ్ము పొమ్మనుట యేగతు లింటియ కాక మాకు నీ
యీవు లదేమి గిత్తు విడె మే పదిలప్పులు వద్దటంటిమా
దేవరచిత్తవృత్తి యొక తీరయి యుండు నిదేమటంచు మి
థ్యావినయోక్తుల న్విటులయర్థము లొల్తురు వారకామినుల్ 86

గీ. అనఘ వేశ్యావిడంబ వర్తనము లెన్న
నిసుకపాతఱ యీజోలి యేల త్రవ్వ
న ప్పుడుపుఁ గూటిపై నసహ్యత జనించి
నామనసు రోసినట్టి చందంబు వినుము. 87

క. ఆరోహిణి నవరోహిణి
నే రతి రవ డుల్లి విలువ హెచ్చులుగా బం
గారములునుఁ దారములు న
పారములుగ నే గడించు పర్యాయమునన్. 88

మ. ఒకయేకాదశినాఁటి రేయి సమునై యున్నట్టి రోకట్టు వే
డుక కాంద్రెవ్వరు రామిఁ బల్లవుఁ డొకండున్ లేక లోఁగ్రాఁగి శ
య్యాకడ న్నిల్వ సహింప కిల్వెడలి యాతాయాతరీతి న్మనో
వికలత్వంబున వాడవాడల విటాన్వేషంబుఁ గావించుచున్. 89

సీ. ఆనిశ వేళ విష్ణుభవనాంగణ మంటపవేదిక న్సుఖా

సీనత నుండి జాగరము సేయు సుధీజను లర్థదీప్తిగా
భూనుతలీల భాగవతముం బఠియింపఁగ నందుఁ బింగళా
ఖ్యానము వింటి నంటిన యఘావలి యెల్లను బోవ వీనులన్. 90

క. అదివిని వేశ్యాభవ మి
ట్టిదెకా యని విరతి పుట్టె డెందంబున బె
ట్టిద మగు నర్థార్జన క
ష్ట దురాశాపాశముం దటాలున నూడెన్. 91

క. ఆవేశ్య నాకు గురువుగ
నే వేశ్యాత్వంబు మాని యేకాకిని నై
శ్రీవేంకటపురుషోత్తమ
దేవాయతనాది దివ్యదేశములందున్. 92

సీ. ప్రద్యుమ్న జనక ధర్మస్థాపకత్వమె
సతతంబు నిజకులాచారముగను
పద్మనాభద్వయోపరి దివ్యనామమే
యనిశంబు జిహ్వ కభ్యాసముగను
జలరుహాంబక చిహ్నములె సంతతంబును
బాహుమూలముల కాభరణములుఁగ
భగవద్విలాస వైభవమె యశ్రాంతంబు
నంతరంగంబున కాస్థగాఁగ

గీ. నవిరళ భుజంగశయన సేవానురక్తి
చిత్తమున హాటకాంబర చింతనంబె
కాని తక్కినవాని డగ్గఱఁగఁ బోక,
భాగవతముద్ర నెంటి నిప్పాట నుండి. 93

మ. అకలంకస్థితి నాటనుండియును శూద్రాన్నంబు వర్జించి మా
ధుకరప్రక్రియ బ్రాహ్మణాన్నమె భుజింతుఞ్ లేనిచో సజ్జన
ప్రకరాగారములందుఁ జేయుదు స్వయంపాకంబు శ్రీరంగశా
యి కృప న్వేళ్ళె దినంబు లీకరణి స్వామీ నేటిపర్యంతముఞ్. 94

గీ. వారసతులైన యాసీమవారివలెనె
మోడి మానిసి నైన నేగోడు లేదు
జిహ్వ నాల్గచ్చరాలు నేర్చిన కతాన
పదుపుఁ గూటికి మనసు గొల్పక యుకైతి. 95

క. అని వనిత యివ్విధంబునఁ
దనకులశీలములఁ దెల్ప దానిని వేశ్యాం
గనఁగా నెఱిఁగి మనంబున
ననుమానము వొడమి వైష్ణవాగ్రణి యనియెన్. 96

క. ఇమ్ముల వేశ్యాసహనా
సమ్ములు శ్రీవైష్ణవులకుఁ జందం బగునే
మమ్మావల నేమందురొ
కొమ్మా యీలోకు లెంచుకొమ్మా దీనిన్. 97

ఉ. కాకులు రావిపండ్లుదిని క్రక్క శిలామయ దేవమందిరా
నీకములందు రావులు జనించును సజ్జనచిత్తవృత్తి య
వ్యాకులలీల తొలిగడివంటిది లోకములోన వేశ్యలుం
గాకులవంటివార లటుగానఁ బ్రమాదము చేరనిచ్చినన్. 98

వ. అనిని నవ్వేదవేదికి దేవదేవి యిట్లనియె. 99

ఉ. ఎందటికెనఁ గొంగొనఁగి యెంతటికైనను బాస దప్పి మై

నెందఱు రోఁతసేఁత లపు డేగతిఁ జేసిన నిచ్చగించుచున్
డెందము తాయిగాఁ గొని గడించిన కష్టపు లంజకూడు నా
కిందక రోసి వచ్చితి సహించునె క్రక్కినకూడుఁ గ్రమ్మఱన్. 100
క, భోగేచ్ఛ నాకుఁ గల్గిన
నీగతిఁ జరియింప నేటి కింటనె యున్న
న్నాగదె మున్నిట విటసం
భోగము గంతలకుఁ దగిన బొంతలు లేవే. 101
క. నామనసు రోసి విడిగిన
దీమెయి నీమనసు రోయకే విడిగిన దిం
దేమిటికి శంక పడ ధా
త్రీమండలిఁ బాలు విఱిగి తే పెరుగగునే. 102
క. వినవే సామెత మును తన
మనసు పదిల మైన లంజెమందిరమున నై
నను గాపుర ముండఁగ నగు
ననఁగను నిట్లాడ నీకు నగునె మహాత్మా. 103
వ. అని యిట్లొప్పవడం జెప్పిన నప్పలుకులు విని యతండు తనమనంబున.
గీ. రూపమునఁ గుంటి గాదు కురూప గాదు
వారసతి యై గడించు నీవయసు నందు
దేశమున భైక్ష మెత్తుకో దీని కేల
మనసు గట్టి విరక్తిఁ బొందినది గాక. 105

## విప్రనారాయణుఁడు దేవదేవి దాస్యం బంగీకరించుట.

గీ. దాస్యవృత్తికి నిటువంటి దానిఁ జేర్చు
కొనఁ గొదువలేదు వలదు పొమ్మనఁగ నేల

యిది యదృచ్ఛాప్తలాభమై యొదవెఁ దోఁట
పనికిఁ జేదోడు వాదోడు పాటుపడును. 106

క. బరవసముతోడఁ బని కొ
క్కరుఁడను బొరలంగ నీపె కలిగె సహాయం
బిరువురము నైన రంగే
శ్వరు కైంకర్యంబు నిర్విచారత సాగున్. 107

వ. అని తలంచి యమ్మెలఁత కిట్లనియె. 108

గీ. నెలఁత సుకుమార మైనది నీదు మేను
తోఁటపని సేయునెడఁ బసాపాటు మాధు
కరము మాతోడిలంకె నీకరణి నుండ
నోపుదే యన్న నతనిక య్యువిద యనియె. 109

గీ. అనఘ జాత్యభిమాన దేహాభిమాన
లేశములు దాసురాలికి లేవు మాధు
కరము నలవాటె మీవంటి ఘనులు దిద్దు
పనులు సేయుటకంటె శుభంబు గలదె. 110

సీ. ప్రామె నెక్కు నేరను గాని పువ్వులుగోయ
దండలు గట్ట వింతలుగ నేర్తు
నేత మెత్తఁగ నేర నింతియ కాని నే
గట్టిగా నీర్మళ్ళఁ గట్ట నేర్తు
ధరణి గద్దలి వట్టి త్రవ్వ నొక్కటి నేరఁ
గాని నే మళ్ళచ్చుఁ గట్ట నేర్తు
బరవసంబునఁ జేనిపని నేరఁ గాని నే
నింటిలోపలి పను లెల్ల నేర్తు

గీ. బుద్ధి మతిఁ జెప్పి స్వాములు దిద్దుకొనిన
సేవనికి నైన దాసుఁగా లోపఁ గలదు
అర్థి మాఱటు రంగేశుఁ డైన నిన్నుఁ
గూర్చి వచ్చితిఁ గరుణ నీ దేర్చు నన్ను. 111

సీ. నిర్వాణరాజధానికి నేగువారికిఁ
జక్కని త్రోవ యాచార్య సేవ
విరజానదీ సముత్తరణంబునకు మనో
జవమైన నావ యాచార్య సేవ
త్రిజగజ్జనులకు సతీపతిన్యాయమై
చాగిన త్రోవ యాచార్య సేవ
అజ్ఞానహతులను విజ్ఞానులను జేయు
సంజీవితీవ యాచార్య సేవ

గీ. యాశ్రయించిన వారల కర్థి నిచ్చు
విష్ణుసాలోక్య సారూప్య వివిధదివ్య
భోగసామ్రాజ్య వైభవాభోగ మహిమ
శాశ్వతం బైన తేవ యాచార్య సేవ. 112

గీ. అనిశ మాచార్య సేవ గల్గిన జనులకు
దేవభూదేవ తీర్థసంసేవ లేల
అనిశ మాచార్య సేవ గల్గని జనులకు
దేవభూదేవ తీర్థసంసేవ లేల. 113

గీ. అనుమ శ్రీవైష్ణవకథా రహస్యథర్మ
మార్యు లెన్నుటఁజేసి యాచార్యబుద్ధి
మిమ్ము సేవింప వచ్చితి నెమ్మి వెరవుఁ

గలపి పనిఁ గొను మెద నలమలులేక. 114

క. తిరుకట్టిసేవఁ జేసెదఁ
దిరుమాళిహ నలికి పూసి తీర్చెద ముగ్గుల్
తిరువంజనంబుఁ దీర్చెదఁ
దిరుపుట్టము లుతికి వేగఁ దెచ్చెద దినమున్. 115

క. అన విని యతఁ డవ్వనితం
గని యప్పలుకులకు నలరి కామిని రంగే
శుని కైంకర్యము చేకొని
మన మిరవుగఁ జేయుదము సముంచితభక్తిన్. 116

ఆ. అని తదీయదాస్య మంగీకరించె న
ద్దాసరయ్య యచట నా సరోజ
లోచనయును బ్రానిలోఁ జేవ చొచ్చిన
గతిఁ బ్రవేశ మంది ప్రతిదినంబు. 117

వ. ఇట్లుపచరించుచు నతనికి నయ్యాలివ యి ట్లనియె. 118

క. ధరలో మాఱట రంగే
శ్వరుఁడవు దాసులకు నీవ సంతతమున్ దే
వర కైంకర్యము మన్మథ
గురు కైంకర్యంబు దీనఁ గొదవయె నాకున్. 119

సీ. అరుణోదయంబున కట మున్న మేల్కాంచి
నది కేగి యాచమనంబుఁ దీర్చి
మజ్జనం బాడి నామము జాదుకొని యాత్మ
వస్త్రంబు నతని దోవతియు నుతికి
తిరువంజనముఁ జేసి తిరుమాళ్ళి కసవూడ్చి

యలికి ముగ్గులు వెట్టి యతఁడు మేలు
కని వచ్చునపుడు గన్గొని వందన మొనర్చి
యాచరణీయ కృత్యంబు లడిగి

గీ. యతఁ డనుష్ఠాన మొనరించి యరుగుదెంచు
వేళ కారామవాటిఁ గ్రొవ్విరులు గోసి
సరులు దండలుఁ గావించి సజ్జనించి
యతని ముందఱ నుంచు ని ట్లగునె యంచు. 120

గీ. మెలపుతోఁ జెట్ల పాదులఁ గలుపుఁ దీయు
నెమ్మి దోహద ధూపధూమమ్ము లిడును
సంద్రప్రొద్దైనఁ గసవూడ్చి మందిరమునఁ
దిరువళికు వెట్టు నెరపు రాతిరులు దాఁచు. 121

గీ. ధాన్యముష్టి గలా మెత్తి దాన నిత్య
మేకతంబునఁ దా స్వయంపాక మాచ
రించి సాపాటు సేయుదు నంచు నతని
మొఱఁగి తనయింటికేగి ముష్టఁ భుజించు. 122

ఆ. చెఱఁగు మాసినపుడు మఱుఁగున మూన్నాళ్ళు
నొదిగి యుండి నాలవ దివసమున
నొరులు పోయునట్టి యుదకంబునను తీర్థ
మాడి పిదపఁ దీర్థ మాడు నదిని 123

వ. అంత 124

గీ. తోయజానన యన్నపానీయములకు
నాస పడ కిట్లు వెలలేని దాసియగుచు
నెనసి పనులెల్లఁ జేయఁ గన్గొని కృపాప

రాయణుండైన విప్రనారాయణుండు. 125

సీ. ఏఁ బసాపడి తోఁట కేతెంచు నందాఁకఁ
బనిసేయుఁ దాఁ బసాపడను బోదు
నేఁ జేతఁ బని వట్టి తేఁ జూచి ముందుగాఁ
దానందుకొను నెడల్ దాఁచుకొనదు
నే మేల్కొనకమున్న తా మేలుకొని దేహ
శుద్ధియై తిరుమాళ్ల శుద్ధి చేయు
నే నిద్రఁ బోవుదాఁకా నిద్రఁ బోవదే
పనిఁ జెప్పవో యని పాయకుండు
గీ. విరతిమై నింట వేవుర విడిచివచ్చి
తోఁట పనిపాటు కొదిగి నాతోఁ బ్రయాస
పడుచు నున్నది పరదేశి పడుచు దీని
సాఁకకున్న నుపేక్షోపచార మొదవు 126

వ. అని తలంచి యద్దేవదేవిం గనుంగొని. 127

చ. లలనరో యెందు నీవిఁక గులామునకుం జన వద్దు మాకు ని
చ్చలు పెరుమాళ్ళకో వేలఁ బ్రసాదముకట్టడి సాగివచ్చు నా
తళియప్రసాద మీవు సతతంబుఁ బసాపడుమన్న మ్రొక్కి యా
మైలఁతుక స్వామి చిత్త మని మేకొనియెన్ ముదితాంత రంగయై.

వ. అంత నవ్విప్రనారాయణుండు. 129

గీ తనకుఁ గోవెలపడి ప్రసాదము నిరంత
రంబుగా సాఁగి వచ్చు శ్రీరంగ విభుని
పళ్ళెరంబు ప్రసాదంబు ప్రతిదినంబు
ప్రొద్దుప్రొద్దున రేఁపుమాపులును దెచ్చి 130

క. కూరలు నన్నముఁ దిరుప
ణ్యారముఁ బచ్చళ్ళుఁ దిరుకణామధు మధురా
హారములు నవ్వధూటికిఁ
జోరుచి ముప్పూటలును బసాపడఁ బెట్టున్. 131

ఆ. తాను మాధుకరము మానక యెప్పటి
యట్ల వైష్ణవాలయముల కరిగి
రంగవసతిఁ దిరువరంగంబె కోవెల
యనుచు భిక్ష మెత్తుకొని భుజించు. 132

ఉ. ముద్దియయున్ సదా యతని మ్రోలఁ బితిందికడన్ గలంకులం
బ్రొద్దొకచాయ వర్తిలుచుఁ బూవిలుకాని ప్రయోగభూతమై
యెద్దెసయుం బ్రవేశమున కించుక యేనియు సందులేమిఁ బె
ల్లొద్దిక రంధ్ర మారయుచు నుండెఁ దదేకపరాయణస్థితిన్. 133

సీ. మూఁపుపైఁ గురులు క్రొమ్ముడి సేయు నొకవేళ
నొకవేళఁ జెంపకొ ప్పారఁగ దిద్దు
వెలి నాభి దోఁప నీవి సడల్చు నొకవేళ
నొకవేళఁ గంచుకం బూడ్చి తొడుగుఁ
దొకతొక నాడు ముద్దులమాట లొకవేళ
నొకవేళఁ బ్రౌఢోక్తు లొనర నెరపు
వలిపెంబుఁ గట్టుఁ బావడ లేక యొకవేళ
నొకవేళఁ బయ్యెద నోర చేయుఁ

గీ. గదిసి వీనులు సొక్కఁ జొక్కముగఁ బల్కు
నొయ్య నొయ్యన సంగీత మొక్కవేళ

సకియ యస్ఖలిత బ్రహ్మచారి యైన
వైష్ణవోత్తము బ్రోల లావణ్యలీల. 184

వ. ఇవ్విధంబున. 185

క. వటుమానస సుక్షేత్రముఁ
గుటిలాలకచేష్టితముల గుద్దలిఁ గొని యి
ట్టటు పాదుచేసి మోహపు
వటబీజము మరుఁడునాటి వర్ధిలఁ జేసెన్. 186

క. ఐహికసౌఖ్యంబుల ని
ర్మోహుం డగువటుని కత్తరుణి సద్దాస్య
స్నేహం బతిపరిచయమున
మోహంబై బుద్ధి చలనముం జేయుటయున్. 187

సీ. ఆకాంతఁ ఱెప్ప వేయక చూచు ననిశంబుఁ
దలఁపు చేతనె తృప్తిఁ గొలుపు మదికి
వనజాక్షి కొంగు సోఁకిన మేను గరుదాల్చు
మొగము విప్పఁగఁ జేయు మగువ నగిన
నర్ధి నెయ్యానఁ గోర్కి నడుగ నుద్యోగించు
నడుగఁ జాలమి నేటి కనుచుమానుఁ
జెలి పల్కు మెచ్చి కోయిలపల్కు దూషించు
నధరంబుమధువున కాసఁ జెందు

గీ. శిరసుపైఁ బేనుఁ బొడగన్నఁ జేరఁ బోయి
హింస సేయకు మని చేతి కిచ్చుఁ దిగిచి
తన్మయత నొంది కలికి చేఁతలనె హరిప
రాయణుం డైన విప్రనారాయణుండు. 188

శా. ఆ విప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగన సాహచర్యగుణ సంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పుష్పమై తన్మకరందమై కరఁగెఁ బోఁబో నీళ్ళకుం బల్చనై. 139

గీ. గాఱఁ ద్రావిన మీనుసంగతి మనోజ
వేదన నతండు పొరలఁ దన్వియు నెఱింగి
తన పలుకుఁ జేరెఁ బో బోడిదాస రనుచు
డెందమునఁ జాల సంతస మందె నంత. 140

## వర్షర్తువర్ణనము.

గీ. రంగవిభునకు విప్రనారాయణుండు
చేయు తోమాలికలకుఁ జాంపేయకములు
వేసవి యొసంగె నని మెఱుఁగ ల్వైర లొసంగ
మతిఁ దలంచెను తరువాతి ఋతు వనంగ. 141

సీ. చాతకవ్రజ పిపాసాప్రతోద్యాపనా
కార్యనిర్వాహకాచార్యవరుఁడు
భూపురంధ్రీ గ్రీష్మతాపజ్వరప్రణా
శన రసౌషధ చికిత్సావిదుండు
మహనీయ భూమిభృద్గ్రహావిహారిమయూర
సందోహ నటనదీక్షాగురుండు
శతపత్ర మిత్రాపహృత జగజ్జీవన
ప్రత్యర్పణక్రియా ప్రథితదాత

గీ. మొనసి నీరంధ్ర బంధురామోఘ మేఘ
జాతసంజాత వృష్టిసంఘాత వాఃప్ర

ఘూత ఘూతల శీతల వాతపాత
నా ప్రహర్షాగమంబు వర్షాగమంబు. 142

గీ. ఆన మాయప్ప లీక పోతేని యనుచు
ధరణిపంపున దొలుకారుపరువుకాఁడు
నింగి గుడి వ్రాసి యాఁగిన భంగి నపుడు
చండకరుఁ డుండెఁ బరివేషమండలమున. 143

వ. అంత. 144

శా. పార్థక్ష్మాఖిలదిక్తటిత్పటుతటప్రద్యోతవిద్యోతితా
న్యర్థోగ్రాశనిపాతజాతఘనగర్జాడంబరవ్యాప్తి న
త్యర్థంబున్ ధరణీజనంబు చకితం బై యర్జునః ఫల్గునః
పార్థః కృష్ణ యనన్ ధరిత్రిఁ దొరఁగెన్ బ్రత్యగ్రవార్బిందువుల్.

క. కటపెట తొటతొట రాలెడు
పొటపొట చినుకుల ధరిత్రి పొడ నట్లువడన్
సొటసొట నాఁకట సోలుచుఁ
దటతట పడు చాతకముల దైన్యము వాసెన్. 146

శా. అంభోదప్రకరంబు లత్తటి సముద్యద్దీర్ఘ నిర్ఘాత సం
గంభాఘాతవిభగ్న దిఙ్నగ కఠోరగ్రావ ఖండావలీ
దంభాంభశ్చరవాహినీకలుషపాథస్సుంభదంభోధు లై
కుంభద్రోణము గాఁగ వానఁ గురిసెన్ ఘోరాంబుధారాకృతిన్.

క. తోరము లగు నవ్వర్షా
వారములం దొక్కనాఁ డవారితధారా
సారంబు పయోధరముల్
ఘోరంబుగఁ గురిసె ముసురుకొని నిశదాఁకన్. 148

క. ఆనిశవేళఁ దన చవిక
లోని చిలుకతయరుఁగు పై నిలోలత వటుఁడున్
వానపయిఁ జిలుక వాకిటి
తీనియ్యపైఁ జేరి దేవదేవియు నుండెన్. 149

శా. యానోరాశివిశేషణోదితదృగంతారుణ్యతారుణ్యవ
ద్దైవ్యదేహీవరణ(ద్దుర)తుణధనుర్వాద్రిత్రవాద్రిత్రయీ
శైవసంపత్యవిధానవానగరిమా సర్వజ్ఞ పాదానతా
ద్యాదిత్యగ్రగతా సురేశ్వర నివాసా రక్షసారక్షమా. 150

క. అలఘూకృత గుహాభక్త్య
త్కలితాంగ హృదంగకమలతగణివిధానా
ఫలముఖకలితసుముక్తా
ఫలదంబునిదానా! దీనభక్తాధీనా! 151

మాలినీవృత్తము. అనుజఘృతశరాసా ♦ యాశ్రితాపన్నిరాసా
మనుజకనకవాసా ♦ మంజుసాకేతవాసా
యనుస్మృతినిజదాసా ♦ యగ్ర్యకార్యానువాసా
యనుపమవరహాసా ♦ యాతుభిచ్చంద్రహాసా, 152

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర
శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగు నృసింహ
మంత్రితనూభవ పరిచిత భగవద్భాగవతకైంకర్య
విధాన తమ్మయాభిధానప్రణీతం బైన
వైజయంతీవిలాసం బను మహా
ప్రబంధంబు నందుద్వితీ
యాశ్వాసము.

# వైజయంతీవిలాసము

## (విప్రనారాయణచరిత్రము)

---

### తృతీయాశ్వాసము.

---

క. శ్రీజానకీవిలాసో
త్తేజకసల్లాప వసుమతీద్యోపేటీ
రాజత లేపాయితజిత
రాజశతయశఃకలాప రఘుకులదీపా. 1.

వ. అవధరింపు మట్లు నిరర్గళధారావర్షంబు గురియుచుండఁ దీనియపై
దేవదేవి యుండుట యెఱింగి యప్పు డవ్విప్రనారాయణుండు 2.

ఉ. వారిజపత్రనేత్ర నిటు వానసెపంబున నింటిలోనికిం
జేరఁగఁ బిల్చి నాతలఁపుఁ జెప్పినఁ జేకొనకుండిన న్బలా
త్కారము దోష మంచుఁ బలుకం బరభామిని గాదు చెంతకుం
జేరినమీఁదఁ గుక్కుటము సేయు నుపాయముఁ జేయుటొప్పగున్.

క. అని తా నయ్యువతిం గని
వనితా ! చలి నుండ నేల వాకిటికడ వె
చ్చనితావున కిటు రమ్మనఁ
జని తా నాలోనిగడపచక్కనె యున్నన్.

క. అయ్యెడ మిక్కిలి శైత్యం
బియ్యెడ కేతెమ్ము నీవు నింతి నివాతం
బయ్యున్నది యిచ్చో ననఁ
దొయ్యలి యాబ్రహ్మచారితో నిట్లనియెన్. 5.

ఉ. ఆరయఁ బెక్కువాసరము లాయెను నేనిట వచ్చి యెన్నఁడుం
జేరఁగ రమ్ము నీవని స్పృశించుట లే దిదియేమి నాపయిం
గూరిమి నేఁడు మీసరసకుం జనుదెమ్మని యానతిచ్చుటో
సూరివరేణ్య నన్నొరసి చూచుటకో మఱి నిక్కమో యనన్. 6.

## విప్రనారాయణుఁడు దేవదేవితోఁ దన మనోరథము దెలుపుట.

ఆ. నిన్ను నోరసి చూడ నున్నదే పదియాఱు
వన్నెపసిఁడి కొదవ లెన్నఁ గలదె
మా యభీష్టమైన మాట చల్లకు వచ్చి
ముంత దాఁచ నేల యింతి వినుము. 7

క. సరసిజముఖి పంచాయుధ
గురు కైంకర్యంబు మనసు గురువై చెప్పన్
సరి నింకొక పంచాయుధ
గురుకైంకర్యమున నీవు గురు వగు మనుడున్. 8

ఉ. ఆ సరసీరుహాక్షి సతఁ డమ్మెయి నాడిన మన్మథార్త వా
చాసరణిం గడు న్నిజవశంవదుఁ డౌట నెఱింగి చిక్కెరా
దాసరిబోడి యిప్పుడు గదా తలమెత్తి మెలంగఁ గల్గుటల్.
వాసరివారిలో నని మనంబు ఘనం బగు వేడ్క నుబ్బఁగన్. 9

చ. ఎనసి మనంబునం బతుల కింతులకు న్వల పంకురించినం
గొనకొని ధాత్రి నేనుఁగులకొమ్ములు వచ్చినయట్టు లింక ని
ప్పనికిఁ బ్రసూనసాయకుఁడె పైతరువే మనసీక వీనిఁ జెం
దిన వలరాచవెఱ్ఱి తరితీపులచేఁ దల కెక్కెఁ జేసెదన్. 10

వ. అని యూహించి యతని కిట్లనియె. 11

గీ. అనఘ మీ తిరువడిఘళే నాశ్రయించి
నపుడె మద్దేహజీవధనాదికములు
తావకాధీనములు గావె దానికేమి
విన నవధరించు మీదాసి విన్నపంబు. 12

శా. క్షేత్రజ్ఞప్రకృతిస్వరూపవిదు లక్షిఘ్రాణ జిహ్వాతను
శ్రోత్రోద్భూతసుఖవ్యపేతు లురు విష్ణుధ్యాన పారాయణుల్
మిత్రామిత్ర సము లభవాదృశులు స్వామీ! ప్రాకృతుల్వోలె ని
ష్మాత్రద్వారము పేరి ఘోరనరకంబుం జేరఁ గాంక్షింతురే. 13

క. పరకాంత దోస మటు పైఁ
బరికించిన శూద్రజాతిఁ బడుపుసతి న్నే
వరదాసి నీవు మాంజీ
ధరుఁడవు వైష్ణవుఁడవంటఁ దగునె మహాత్మా. 14

ఉ. విప్రకులావతంస పృథివీస్థలి నిట్లపవిత్రురాల వి
ష్ణుప్రతిమాను నేక్రియ నినున్ స్పృశియింపఁగ నేర్తు నావుడున్
విప్రులఁ బొంది రేని యపవిత్రులు పూజ్యు లటన్న భారతీ
యప్రథితోక్తి గాదె వనితా పరిహారము నీమశంకకున్. 15

శా. దాసీసంగతుఁ డైన వ్యాసు గురుకాంతాగామి శీతాంశు వే

శ్యాసాఖ్యాన్వితుఁ డైన కౌశికుని శూద్రాపత్యక న్యారతి
వ్యాసక్తుం డగు నప్పరాశరుని నేవారైన వెల్వెట్టిరే
నీసంగంబున వారి కైనగతి తన్వీ నాకుఁ గానిమ్మికన్. 16

వ. అనినఁ గ్రమ్మఱ నమ్మగువ యిట్లనియె. 17

ఆ. నిడుదపట్టె తిరుమణియ వైష్ణవము గాని
మీర లాడు మాటతీరు నూడ
ననఘ నొసలు బత్తుఁడును నోరు తోడేల
టన్న రీతి దోఁచు చున్న దిపుడు. 18

చ. పడుపునకే సృజించె మును పణ్యవధూటుల బ్రహ్మ యట్టి వం
గడమునఁ బుట్టి యున్న కడఁగా దని రోసితి నేను నీ వయో
వడుగవు బ్రహ్మనిష్ఠుఁడవు వైష్ణవధర్మవిదుండ వాపనుల్
నుడువ జుగుప్స పుట్టకిటు నో రెటు లాడెఁ దలంపుమా మదిన్. 19

గీ. తోన యారూఢ పాతిత్య దోష మిందు
సంభవించు భవద్బ్రహ్మచర్యమునకు
వైష్ణవోత్తమ నా కిందువలనఁ జిక్కు
మొదలిపాటుకు వచ్చినఁ గొదువ లేదు. 20

గీ. అనఘచారిత్ర శ్రీవైష్ణవాపచార
మెట్లు సేయుదు మిమ్మంటి యే నటన్న
భావభవ పుష్పభల్ల ధారావిభిన్న
హృదయుఁడై తొయ్యలికి నతఁ డిట్టు లనియె. 21

క. అపచారము గా దిది మా
కుపచారమె కాని యోతలోదరి సమ్య

కృపచేఁ గైకొని శంబర
రిపుచేఁ జాకుండ నుద్ధరింపుము నన్నున్, 22

క. ఓసతి భగవత్సేవకు
వాసి గణింపంగ భాగవతసేవయ త
ద్దాసుల కైంకర్యముఁ గృపఁ
జేసిన రంగేశ్వరునకుఁ జేయుటె సుమ్మీ. 23

వ. అనిన సమ్మాటకు మందస్మిత సుందర వదనారవిందయై యిందువదన దేవర చిత్తంబు కర్తవ్యం బెద్దియనిన. 24

విప్రనారాయణుఁడు దేవదేవిం గూడుట.

క. తిరువళకు మలపు మనవుఁడు
దిరువళకు మలంచి నపుడె దేవరదాసిన్
దిరునడిఘుల్ కైంకర్యముఁ
బరువడిఁ గావించు టెట్లభాసము గాదే, 25

క దీపము మన్మథరాగో
ద్దీపము లక్ష్మీకరము మదికి భయహర మా
దీపము లేని రతు ల్పాఖ
లోపము లవి చీఁకటింటిలో వెకిరింతల్. 26

వ. మఱియును, 27

క. ఆడెదు కొమ్మ పదంబులుఁ
బాడెదు కలకంఠి మోము భావజు కేళిం
గూడెదు సకియల చోటుల్
చూడక రహిఁ పుట్టదంద్రు సుగుణుల మదికిన్. 28

వ. అనిన నతం డిట్లనియె. 29

క. ఏపనులకు దీపము దగు
నీపనులకుఁ దగ దటన్న నింతి యిటు లనెన్
దీపంబు మలప వల నా
దీపము మనసందు చీర తెర సారింతున్. 30

క. నావుడు నది లెస్స యటం
కావింపు మన న్నిజాంశుకమ్ము విడిచి గ్రా
జీవనయన దిగ్గన న
ద్దీవియకుం దమకు నడుమఁ దెర వైచుటయున్. 31

క. వలిసెంపుఁ జీర తెర లో
పలి దీపచ్ఛాయ వారిసై నవ్వేళం
బలపల నై రాఁ దెరకును
వెలుపలఁ బ్రసరించె లేఁత వెన్నెల పోలెన్. 32

క. తెలుప తెర వైచు నెపమున
నెత్తేఁ గట్టిన చలువ విడిచి నిలిచినఁ గడు న
త్తఱి మెఱసె నొరకుఁ బాసిన
కఱకంతు నరాతి చేతి ఖడ్గముఁ బోలెన్. 33

వ. ఆ సమయంబున. 34

సీ. వెదఁ జేయ నదనైన మదను క్రొవ్విరి చేన
దారొక్కన్న హరిణీపదంబనంగ
ననవిల్తు కేళీవనము చక్కిఁ జూపట్టు
తరుణారుణాశ్వద్ధ దళ మనంగ

దర్పకాలయ బహిర్ద్వార తోరణమునఁ
దళుకొత్తు మించుటద్దం బనంగఁ
గంధర్వదేవు శృంగారంపుఁ దోఁటలోఁ
బొలుపారు దిండెన పుష్పశంగ

గీ. నతనుఁ డంగడి నమ్ము మోహనపుఁ బసస
తోఁచయనఁగ దీని కిల లేదు తులయనంగఁ
దగు సువస్తువుఁ జూచె నమ్మగువ మేన
బలిత మగు వాంఛఁ గూరి యా బ్రహ్మచారి. 35

ఉ. చూచిన యంతలోఁ దనకుఁ జొప్పడుదాఁక నధిజ్యధన్వుఁడై
లాచిన మన్ననుండు కరలాసువ మొప్ప నిశాతపుష్ప నా
రాచ పరంపరల్ పఱపి వ్రయ్యలు చేసెఁ దదీయ శీలముం
గాచిన ధైర్యవజ్ర మయ కంటకముం బటుశౌర్య ధుర్యతన్. 36

వ. ఇట్లు విగతధైర్యుండై యవ్విప్రవర్యుం డయ్యతివ కిట్లనియె. 37

గీ. కొమ్మ నీమోవి యమృతంబుఁ గ్రోలకున్నఁ
బ్రాణములు నిల్వ వతనుతాపమున మేన
దయ నొసఁగు "బ్రాహ్మణో నహంతవ్య" యనిన
వాక్యమూహింపు నావుడు వనిత పలికె. 38

గీ. విటజనోచ్ఛిష్ట మైనట్టి వేశ్యమోవి
వేదపారాయణాతిపవిత్ర మైన
వైష్ణవాస్యంబు నెట్లంటవచ్చు ననిన
వలపు దోలకాడఁ బలికె న వ్వైష్ణవుండు. 39

క. ఆవుల వెన్నయు ధరణీ

దేవులపాదములు యతులదృక్కులు కవివా
చావృత్తి వహ్నివాజి
స్త్రీవదనంబులు కడుఞ్ శుచిత్వపదంబుల్. 40

వ. అదియునుం గాక. 4

క. మృగయావిహారవేళల
మృగదంశకవక్త్రములను మీనాంకాజిన్
మగువల లపనంబును శుచు
లగు నుచ్ఛిష్టత్వ మంట దప్పనిపల్కన్. 4

క. అని ధర్మశాస్త్రసూక్తులు
మనుముఖ్యస్మృతులు తెలుపు మానిని యిఁక నీ
వనుమానము మాని వెసన్
నను మన్మథకేళి నేలు నావుకు వేడ్కన్. 4

క. నారీమణి యవ్వటుని మ
నోరథమును గూడి నిజమనోరథ మొనరం
దారసిలి కౌఁగిలించెను
మారశిలీముఖభయంబు మదిఁ బో నతనిన్. 4

వ. అంత 4

సీ. ఆత్తహస్తమునఁ బంచాయుధచిహ్నము
ల్బాహుమూలంబులఁ బొదుకొల్పి
దల మైన చెమటబొట్టులమితోఁ జెన్నొంద
నలికభాగంబునఁ గలుగఁజేసి
జమిలిరేఫలకు దీర్ఘము లిచ్చి నైచ్యభా

వంబుగా దాసనామంబుఁ జేసి
మానిదుర్లభ మైన మణితమంత్రరవంబు
శ్రవణసంగతి రహస్యముగఁ బలికి

గీ. నెమ్మి రతిదేవిపూజాక్రమమ్ము దెలిపి
యఖిలసంస్కారములు నిటు లాశ్రయించి
మన్మథవ్రాత్యుఁ డైన యమ్మాణవకుని
మృగవిలోచన నిజశిష్యునిగ వరించె 46

క. వటుఁ డైన వైష్ణవుని నిటు
విటుఁ జేసెం దేవదేవి వెడమాయలచే
నటు శయ్యః జేరఁ గలిగిన
నెటు సెయ్యఁగ లేరు వేశ్య లిల మగవారిన్. 47

క. కాయజుఁడు చేయు మాయల
కాయజుఁడు హరుండు నంబుజాక్షుఁడు లోనై
తోయజనయనలఁ బాయరు
హేయజనుల్ నరు లనంగ నెంత ధరిత్రిన్. 48

గీ. మున్ను కందర్పవిశిఖ నిర్భిన్నహృదయుఁ
డగుచు దిన మొక్క కల్పమై యార్తిఁ బొరలు
విప్రనారాయణునకు నవ్వేలఁది సురత
లీల నారాత్రి నిమిషంబుఁ బోలి గడచె. 49

వ. ఇవ్విధంబునఁ గతిపయదినంబులు గడచిన యనంతరంబున నామానినీ
మణి యందుఁ బ్రేమాతిశయంబున నవ్విప్రనారాయణుండు 50

సీ. దినముఁ జల్లనిళ్ళ మజ్జన మాడఁ జలి దాఁకు

నీ కంచు వేన్నీళ్ళు నెమ్మిఁ గాఁచు
బుధవారశనివారములు బీరువోకుండ
శిర సంటు వెచ్చఁగాఁ జేసి నూనెఁ
జమురు పట్టించి యంగములు మర్దన చేయు
మేదించు మేనిపై మినుపపిండి
తల నిమ్మపండ్లు జొబ్బిలఁ బిండి సీకాయఁ
బులిమి తైలపుజిడ్డువోవ దువ్వ

గీ. జలక మాడించు మడుఁగువల్వలు ధరింపఁ
జేయు శిర సార్చుఁ గ్రొమ్ముడి సేయు విరుల
సరులు పైఁ జుట్టి తిరుమణి చాదుకొనిన
దాఁక నిలుచుండు నెదుట నద్దంబు పూని 51

వ. ఇట్లు నిజసేవాపరాయణుండైన యవ్విప్రనారాయణు మోహాతిరే
కంబుఁ గనుంగొని జనితామోదంబున నవ్వనితావతంసంబు. 52

ఉ. వైపరి తొంటినైష్ఠికపువర్తన లన్నియుఁ గట్టిపెట్టి తా
నాపరిచర్యఁ జేసెడు దినంబును దాసరి దాసరీతి నే
నీపరిపాటిఁ దార్చ నగు నింటికి వీనిఁ దటాల్న మత్ప్రతి
జ్ఞాపరిపూర్తియయ్యె నిఁక జాడ్యము సేయఁ బనేమి యిచ్చటన్.

వ. అని తలంచి య వ్విప్రనారాయణుం గనుంగొని య వ్వారారోహ
యిట్లనియె. 54

క. సామి యల కంచినుండిట
నే మీతిరువడిగను శ్రాశ్రయించుట విని పు
త్రీ మోహంబున ముప్పది

యామడ మాయమ్మ వచ్చినది నను జూడక. 55

గీ. వచ్చి యిప్పుడు మాయప్పవద్ద నున్న
దంచు నీప్రొద్దు వింటి నేఁ డటకుఁ బోయి
యెల్లి వచ్చెద నిక్కడఁ దెల్లవాఱఁ
బోయికత్తెనె యనుడు నబ్జాభసురనను. 56

గీ. జల్లనియె గుండె ధాతువు ల్వల్లటిల్లె
మొగముపస చెడె దేహంబుబిగువు సడలె
స్వాంతము గలంగెఁ జేకాళ్ళ శైత్య మొదవె
నాడులు చెమరించె మఱుమాట వెడలదయ్యె. 57

వ. ఇట్లు గుండె జల్లని వివర్ణవదనుం డై మూర్ఛిల్లిన యట్లుండి కొం
డొకసేపునకుఁ దెలివొంది తెప్పిరి దప్పికిఁ బానీయంబు లాని నేదఁ
దేఱి స్థైర్యలిం గనుంగొని దీనాలాపంబుల నిట్లనియె. 58

గీ. నీవు నీవారియింటికి నేఁడు పోయి
రేపు వచ్చెద నంటివి రేయి నాల్గు
జాలు నినుఁ బాసి యెట్లుందు నోలతాంగి
యేను వచ్చెద వెంటనే యింటి కనిన. 59

క. ఏ వెఱతు మిమ్ము రమ్మన
దేవర వేంచేసి రేని తిరువడిసేవ నే
సేవింపఁగ బని వినియెద
భావింపఁగ నింతకంటె భాగ్యము గలదే. 60

## విప్రనారాయణుఁడు దేవదేవి యింటికిం జనుట.

క. వేంచేయుఁ డనినఁ దెలివి జ

నించెన్ మోమునకు మనసు నిర్మల మయ్యెం
జాంచల్య ముడిగ నొయ్యనఁ
బంచప్రాణములు డిందుపాటును బొందెన్. 61

వ. అంత. 62

ఆ. ఇనుపకలప నొక్కయిక్క నిక్షేపించి
కంపక్రిందఁ గొయ్యకలప మాటి
చేఁదబొక్కఁ బొదను జేర్చి భాండంబుల
లోఁతునీళ్ళమడుఁగు లోన ముంచి. 63

చ. వటుఁ డపు డాత్మమందిరకవాటము వాటముగా ఘటించి వె
ల్పట నొకత్రాటఁ గట్టి పదిలంబుగఁ దాళము పెట్టి తోఁటవా
కిట బలుగాడికి న్గడె బిగించి వెలిం బలుకంప నాటి మి
క్కుటముగఁ జంక నత్తిరిపె గూడ ధరించి చలించి వెంబడిన్. 64

సీ. శ్రీవైష్ణవులు నిరీక్షించిరా తిరుమణిఁ
దుడిపింతు రన్నట్టి జడుపు మాని
స్మార్తులు చూచిరా సభఁ బరిహాసంబుఁ
జేయుదు రన్నట్టి సిగ్గు విడిచి
బాంధవు ల్వినిరా యపాఙ్క్తేయుఁ డని యిల్లు
చేర నీరన్న విచార ముడిగి
ప్రభువు లెఱింగిరా యభివాదనమున స
న్మానింప రను నభిమాన మెడలి

గీ. వైష్ణవముఁ బట్టెతిరుమణివశముఁ జేసి
బ్రహ్మచర్యంబు జందెముపాలు చేసి

విటజనోచ్ఛిష్ట మైన యక్కుటిలవేశ్య
యంటున నతండు బ్రాహ్మణ్య మంటు పఱచె. 65

క. తోయజభవకులుఁ డాగతిఁ
గాయజుబారిఁ బడి "కాముకస్యకుతో ల
జ్జా" యను మాట నిజంబుగఁ
బోయెం దోడుకొని వేశ్యపోయిన దారిన్. 66.

వ. ఇవ్విధంబున నవ్విప్రనారాయణుండు కురంగనయనపిఱుందన శ్రీరం
గపురంబునకుం జని యందు. 67

## వేశ్యవాటికావర్ణనము.

సీ. వారటధ్వజధనుర్జ్యారటద్భృంగఝం
ఝంక్రియాటంక్రియాసంకులంబు
లంజికావిటమనోరంజకస్ఫుటవచ
శ్శుంభళీసంభ్రమోజ్జృంభణంబు
క్రుద్ధవేశ్యాంబికారుద్ధనైజప్రియా
యల్లకావనిలుఠత్పల్లవంబు
గోత్రశాలాదివారాత్రమూర్తీభవ
త్ప్రాసవేష్వాసధర్మాసనంబు

గీ. హారిలావణ్యగణ్యపణ్యాంగనాక
దంబశృంగారచేష్టావిడంబవివిధ
ఖేలనాసాంద్రమదనేంద్రజాలకపట
నాటకముఁ గాంచె బురివేశవాటకంబు. 68

సీ. కచ్చించి పాగటాలు గణికలతోఁ గుక్క-
టాండము ల్పణముగా నాడువారు
ద్రవిణముల్ పైపన్నిదము లొడ్డి మాత్సర్య
గతిఁ గోడిపందెముల్ గట్టువారు
వైచిత్రిగాఁ గోలఁ గాచి పన్నిదమాడి
చెఱకుమోపులు లీల నఱుకువారు
గుతి చూపి యట కేగి పఱ తెంచునందాఁక
నొసఁగిన భక్ష్యము ల్మెసఁగువారు

గీ. సాధ్యులై గోత్రశాలల నధివసించి
విటుల వేశ్యాజనములచక్కటులఁ దీర్చు
వారలును గల్గి శంబరవైరిసంత
పేట యన నొప్పు నవ్వేశవాటమునను.

సీ. లంబస్తనములు మాలస్థానముల నంట
గడితంపుఱవికలఁ గట్టి త్రోచి
పుత్రి కానిర్మాల్యపుష్పదామంబులఁ
దోఁజికొప్పులలోన దోపి తురిమి
పుక్కిళ్ళ వీడెంపుఁదొక్కు మెండుగఁ జేసి
కంఠగర్తంబులఁ గాపుఁ గట్టి
బొరుసుమోములబిట్టు వోఁ బచ్చిపసపున
మేదించి నూనెచే మెఱుఁగు పెట్టి

గీ. తనకములు చేటి తమదిక్కు చూడ దోయు
వయసుతో నుందు రవ్వేశవాటి యందు

సూనశరభుక్తనిర్ముక్తశుష్కపత్త్ర
భాజనము లైన వృద్ధవేశ్యాజనములు. 70

సీ. కట్టువర్గము లమ్మగారిపుట్టంబులు
తిలకంబు పూఁతచెందిరపుఁబిండి
కంఠభూషణము లక్కాలిదేవిపాదాలు
భోగవిత్తము హరిజోగు కొలుచు
లారాధ్యదైవతం బంబికాశక్తియు
సత్యార్ఘ్యమద్యంబు నిత్యసేవ
శ్రవణీయసుఖగోష్ఠి బవినీలసంగీత
మెల్లారసీపసత్తు లిష్టసఖులు

గీ. నగుచుఁ దమ్ముఁ జూచి విటజనుల్ నగుచుమండ
నందనల పంచసాయక మందిరములఁ
గాచు జాగిలములు వోలెఁ గాచి యుంద్రు
వేశ్యమాతలు తద్ద్వారవేదికలను. 71

సీ. చిట్టికుంకుమ బొట్టుఁ బెట్టు నెన్నుదుటికిఁ
గెంపారఁ బూఁత చెంద్రంపు బొట్టు
జమిలి ముత్తెపుఁగంటసరిఁ దాల్చు మెడకును
దట్టంపుఁ దోలుపాదాల పేర్లు
వలిపంపు సన్నచల్వలు గట్టు మేనికి
మాతపుట్టము పేరి మైలబట్ట
కపురవీడెము వెత్తిగాని యానోరికిఁ
గొఱమాలినట్టి యా గొంటువక్క

గీ. కటకటా! పుష్పలమ్మ నంగడిసె కట్టె
లమ్మఁ జేసెను మిమ్ము దైవమ్మటంచు
వృద్ధవేశ్యల వగపింతు రుద్ధతప్ర
వర్తులగు ధూర్త విటులు దుర్వారనటులు. 72

వ. ఇట్లనేక ప్రకారంబులయిన వేశ్యావిటప్రకారంబులఁ గనుంగొనుచు నవ్విప్రనారాయణుండు దేవదేవీ పురస్సరంబుగాఁ దదీయ గృహంబుఁ బ్రవేశించి యందు. 73

సీ. సకినెల పట్టెమంచముఁ బట్టుతలగడ
బటువు బిళ్ళలు సూర్యపుటపుఁ బఱపుఁ
జేదివ్వెప్రతిమ చౌశీతిబంధముల మే
ల్కట్టు గోజ్జఁగినీటి గాజుకొప్పె
వటివేళ్ళ సురఁటి జవ్వాది పక్కెనతట్టు
పునుఁగుఁ బింగాణి కప్పురపుఁగ్రోవి
గొడుగుఁ బావలు గందపొడిపెట్టె నునుసాన
గడియారమంచ ముక్కాలిపీఁట

గీ. వెండినాళంబుఁ బటికంపు గిండి చెంబు
జాలవల్లిక పైఁడి బాగాల బరిణె
పంజరశుకంబు మణితశబ్దముఁ బఠించు
పావురపుఁ జోడుఁ గల రతాగారమునను. 74

గీ. దేవదేవీ సమేతుఁడై భావభవ వి
హారగతి నుండె నన్యవిచార ముడిగి
ప్రతిన నీడేర్చుకొని యుదంచితమనః ప్ర
మోద పరిపూర్తి నుండె నప్పైదలియును. 75

క. అటు దేవదేవి యవ్వటు
విటుఁ జేసె నటన్న వార్త వినినప్పుడె కా
ర్పటికగతి దాసురాలై
తటుకున నయ్యప్ప లంజెతనముం బాసెన్. 76

క. కుందంబుల నలుగనియార
విందంబుల నరసి రంగవిభుపూజకు నే
సందంబులు సేయుదు నను
చందంబున నేగుదెంచె శరదృతు వంతన్. 77

## శరదృతువర్ణనము.

సీ. కార్తికచంద్రవిస్ఫూర్తివక్త్రముతోడఁ
జంద్రికామందహాసంబు తోడ
హరిదంతరాచ్ఛవిస్ఫురణాంబరముతోడ
విమలకల్హారనేత్రములతోడఁ
దారావళీస్వచ్ఛహారావళులతోడ
నతులరాజమరాళగతులతోడ
నభ్రవిభ్రమకశాదభ్రమధ్యముతోడఁ
గమలకోమలపదాబ్జములతోడ
గీ. వితతసత్కాశచామరప్రతతితోడ
సకలకవిరాజసంస్తుత్యవికలుసైక
జీవనస్థితి నెరసె నానావనీత
లముల శారదసమయవిలాసలక్ష్మి. 78

వ. ఆసమయంబున. 79

సీ. ప్రచురమై యొకచోటఁ బాటీరకర్పూర
 కస్తూరికాదులకమ్మతావి
దండిగా నొకచోటఁ బిండివంటలవెంటఁ
 బ్రభవించు తైలాజ్యపరిమళములు
రహి నొకచోటఁ గూరలతాళిపోఁతల
 తోరంపుసంభారసౌరభములు
రమణ నొక్కొకచో సురభ్రాదిమస్తముల్
 గమలించు మాంసంపుగముల కమురు

గీ. గ్రమ్ముకొని యొక్కచో నంబికాసమర్చ
నానసముద్భూత మైరేయవాసనలును
లంకెఁ దోఁదోఁపు లాడంగ లక్ష్మిదేవి
పండు గేతెంచెఁ గన్నులపండు వగుచు. 80

వ. ఆదినంబునందు. 81

ఉ. అచ్చినవంక నైనఁ దమ రావల నప్పుల దూసి యైననుఁ
ముచ్చిలి యైన జీవధనము ల్దిగ నమ్ముడు వెట్టి యైన నుం
డెచ్చుగ సంతరించి తమ పేదఱికంబుఁ దలంప కర్థము
ల్దెచ్చి యనుంగువేశ్యలకుఁ దీర్తురు పండుగదండుగ ల్విటుల్. 82

క. మింతజనదత్తమేషీ
కంఠసముద్భూతరవము కడు నెమ్మది ను
లత్కంఠ సలిపె వేశ్యాక
కంఠుల కత్తఱి గృహోపకంఠము లందున్. 83

వ. ఆసమయంబున. 84

సీ. గణికాభుజంగసంఘటనయాతాయాత
జామాతృభయదవాచాప్రభూత
వివిధమాయోపాయవిరచనప్రఖ్యాత
కర్కశోపలసదృక్కఠినచేత
నందనీపల్లవానందదత్తవిఘాత
జనపాతకాన్యాంగజప్రపాత
యజ్ఞాతగోత్రనామాకారనిజతాత
యుల్లాఘుశతసమాయుస్సమేత
గీ. చైత్రహృజ్జన్యసస్యసశస్త్రజాత
కలుషవీక్షాతిరస్కృతజ్వలదలాత
పరుషవాచార్భటీసముత్పాద్యమాన
దీర్ఘనిర్ఘాత యద్దేవదేవిమాత. 85

గీ. విత్తమీలేని విటకోటి వెడల మీటి
విరహపరితాపమును రేచి వెతల నేచి
మదనధాటి యనంగఁ జేరొదవి వెలయు
విపుల మైరేయమణిక యావృద్ధగణిక. 86

గీ. ఊరివేశ్యల కెల్లను వారివారి
విటులు పండుగతగవు లంపుటలు చూచి
విప్రనారాయణునివిటవృత్తిఁ దమకు
నీవి లేకున్కిఁ గని దేవదేవి కనియె. 87

క. తమ్ముపల పంట కుండఁగఁ
గ్రమ్మివిటులఁ గలయు నేర్పుఁ గఱపెదు మనకున్
గొమ్మరొ తామరయాకునఁ

గుమ్మరిపురుషులును బరమగురువులు సుమ్మీ. 88

వ. అని విప్రనారాయణునుగురించి. 89

క. చక్కఁదన మెంత గలిగిన
రొక్కమునకుఁ గాని వల్వరు మనందు జనుల్
రొక్కములు జోలెలాతని
చక్కఁదనం బేమి చూచి సకియ వలచితో. 90

క. నవమదను డైన మెచ్చవు
తవిలితి వీయవ బోడితలకు వలచితో
ధవళాక్షి వీని ప్రేలుం
జెవులకు వలచితివొ పిల్లసిగకు వలచితో. 91

ఆ. రమణి యితఁడు తిరువరంగంబెరయాకో వె
లనుచు బికిర మెత్తినపుడె జనులు
వీఁడె దేవదేవివిటుఁ డన్నఁ దల వంచు
కొనఁగ వలసె నాకుఁ గువలయాక్షి. 92

ఆ. తొత్తుపేరఁ బెట్టి దొడుకుపేరను బెట్టి
పిల్లికూనపేరఁ బెట్టి యిల్లు
వెళ్ళలే దటంచు మెల్లన ముదుగులు
పాఱ విడుచు చుండుఁ బాటఁ బాట. 93

ఉ. వేసరి యే మటన్న నిలు వెల్వడఁ ఝాలఁడు చేత నంటిమా
దాసరిబుట్టియున్ ముదుకధ్వావళిధట్టియుఁ గాని కాన మో
కేసరిమధ్య నీప్రతిన గెల్చె నిఁక న్బరిపాటి నొయ్య నీ
దాసరి నోసరింప వలదా సరివేశ్యలు నవ్వకుండఁగన్. 94

వ. అనినఁ దల్లి కాగణికామతల్లి యిట్లనియె. 95

క. పోది నప్పుడు నేను బ
న్నిద మాడినకోస మితనిఁ దెచ్చితి నీక నా
కొదవపని దీఱె నీక నీ
కొదవయె యని పల్కెఁ దల్లి కూఁతున కనియెన్. 96

ఆ. తెఱవ నేను నోరఁ దెఱవ కుండఁగఁ గాక
చోరవ గొనుచు నిల్లు చొర వశంబె
పఱవఁ బొమ్మ టంటఁ బరువటే నాకు నీ
యఱవఁ దోఁకఁ గోసి యఱవఁ జేతు. 97

క. ఇటు చూడు నాప్రతాపము
విటులం జోఁపిడుట నాదువిద్య మొదల నీ
వటుఁ జేమి బ్రాఁతి నాయా
గ్ఘటికిన్ భూతాలు బెదరి పాఱుచు నుండున్. 98

క. వెచ్చానకు లే దనఁగా
నిచ్చటి కేతెంచి యూతఁ డిచ్చిన మేలే
వచ్చినది లాగుకొని మఱి
చొచ్చో యనిపింతు నిదియ నూ మత మనుచున్. 99

సీ. పసపుఁ బిండియు సగపాలు గూర్చినపూఁత
బొట్టుపైఁ జెంద్రంపుబొట్టు వెట్టి
క్రొత్తకమ్ములతోఁడి కూనలమ్మపటంబుఁ
గటి విప్పఁగా రెండుకట్లు గట్టి
మేలిమిపైఁడిపాగాలసంగతిని న
ర్తన మాడు పెద్దపాదా లమర్చి
కప్పుపయ్యెద క్రిందుగా జాఱు చనుదోయి

పారి బొజ్జకడుపు పైఁ బొరలఁ బెట్టి

గీ. విప్రనారాయణోచ్చాటవిధికి దేవ
దేవి యంపిన మంత్రశక్తియును బోలి
సోలుచును వచ్చె మధుమదాలోలవిహ్వ్రాత
వివిధమాయాప్రభూత యవ్వేశ్యమాత. 100

వ. ఇట్లు వచ్చి నిలిచి విప్రనారాయణుం గనుంగొని. 101

ఉ. అల్లునియమ్మగారి కిపు డాఁకలి గాదొకొ యింటికేమియుం
జిల్లరవెచ్చసచ్చములుఁ జీరలు నంపవు తోడివేడ్కకాం
క్రేల్లను బండుగ న్దగవు లీయఁగఁ దాఁకి తలంప వీవు చేఁ
బెల్లుగ రొక్క మీక ధరఁ బిల్తురె వారసతు ల్విటావళిన్ 102

సీ. నీపట్టెతిరుమణి నీతిరుచూర్ణంబు
గణికకు వెండిబంగారు లౌనె
నీపుట్టగోఁచియు నీకావివేష్టువ
ల్వారకాంతకుఁ బట్టుచీర లౌనె
నీముష్టిగూడయు నీతులసిసరులు
వేశ్యకుఁ బండుగ వేఁట లౌనె
నీవేదశాస్త్రము ల్నీసంధ్యజపమును
లంజెసానికిఁ బంజులగములౌనె

గీ. పెట్టనోపితివా యెప్ప టట్టె యుండు
పెట్టలేకున్న విచ్చేయు పెందలకడ
మొదల రోయింతులకు నొక్కముడుపె గాక
నీసదాచార మేలయ్య దాసరయ్య. 103

## విప్రనారాయణుండు తన పువ్వులతోఁట కరుగుట.

వ. అని మఱియు ననేకప్రకారంబుల నవ్వాటునకుఁ గర్ణకఠోరంబుగాఁ బుచ్చెదోరల నుచ్చాటనవచనంబుల భర్జించిన నతండు. 104

గీ. వేశ్యమాతయు గతవయోవృద్ధ యైన
యిది సురాపాన మొనరించె నిట్టివేళఁ
గోఁతి కలు ద్రావి యుండఁ దేల్గుట్ట భూత
మావహించిన యట్టి స్వభావ మరయ 105

ఉ. సిద్ధ మహాత్మురా లిది నిషిద్ధపునోటను సిగ్గొకింత లే
కుద్ధతలీలఁ జాలఁ బరుషోచ్చరణంబుల బూతు లాడెడుం
బుద్ధి గణింప నిల్వెడలిపోవుట కార్యము పోవ కున్న నీ
వృద్ధపిశాచికిన్వలయు విత్తము నా కది యెందుఁ గల్గెడిన్. 106

క. రాక లఁటఁ గోక లఁట మఱి
యాకులు పోక లఁట గొఱియ లఁట యవి నాకు
న్లేకుండుట తథ్యం బఁట
పో కుండుట నీతి గాదు బుద్ధిఁ దలంపన్. 107

వ. అని నిశ్చయించి. 108

చ. కరమున మ్రానికుండికయుఁ గంబళి మంసము నందు జంకపైఁ
దిరిపపుగూడయు న్గొని తదీయనివాసము నిర్గమించి యె
వ్వరు దనుఁ జూతురో యనుచు వంకముసుం గిడి నమ్రవక్త్రుఁడై
యరిగె నతండు పంచశరునల్గులమూటకుఁ దొంటి తోఁటకున్. 109

వ. ఇట్లు చని యం దొక్క తరుమూలంబున నాసీనుండై యతఁడు తన మనంబున. 110

చ. జనని ధనాశ నిట్లు విరసంబులు బల్కుచు వెళ్ళఁదోలుట
ల్వినదు సుమీ యొకింతయును వీనుల నప్పుడు దేవదేవి య
ప్పనిత యెఱింగె నేనియు నవశ్యముఁ దల్లి నదల్చి నన్నుఁ బి
ల్వను జెలిఁ బుచ్చునో మదిఁ గలంకము మానుపఁ దానె వచ్చునో.

వ. అని మఱియును. 112

క. ఆరీతిఁ బ్రేమ గల్గిన
నారీతిలకంబు రాదె నావెంటనె లే
దారీతి యింక శంబర
వైరీతిఁ దరించు నట్టి వల నెయ్యదియో. 113

గీ. సతికిఁ బతికి సమాన మై జరగ దేని
నిరయమున లేదు వలపంతనిగ్రహంబు
సతికిఁ బతికి సమాన మై జరిగె నేని
స్వర్గమున లేదు వలపంత సౌఖ్య మెన్న 114

చ. తలఁచిన నిద్ర రాదు చలి దాఁకను మోసలఁ జేర నెవ్వనిం
బిలచిన గుండె జల్లుమనుఁ బేర్చు మనఃపరితాపవేదన
ల్నిలచినచోట నిల్వ ధృతి నెక్కొన దక్కట రంగ రంగ తా
వలచిన యింతి బాయుపగ వద్దు సుమీ పగవారి కేనియున్. 115

ఉ. నున్నని బాహుమూలములు నూత్న సుధారస మొల్కుపల్కులుం
దిన్నని మేనుదీవయు మదించిన సిబ్బెపుగబ్బిగుబ్బలు
న్గన్నుల నవ్వునెమ్మొగముఁ గన్నులఁ గట్టిన యట్లు నాకు నా
చున్నది నామతిభ్రమణమో మరుమాయయొ కొమ్మనైజమో. 116

తే. ◆లనముఁ జేసి మన్మథకేళి నేఁడు

కుసుమకోమలి యెవ్వనిఁ గూడు నెకొ్కా
యతఁడు దొలుజన్మమునను శ్రీహరిని బ్రేఁడి
పుష్పములఁ బూజచేసిన పుణ్యాలముఁడు. 117

గీ. అలివ వైష్ణవమతరహస్యమునఁ జాలఁ
బరిచయముఁ గన్న యట్టి ప్రపన్నురాలు
శూద్రసంపర్కమున కేల చొచ్చు మరల
నిచ్చటికి నెంతప్రౌఢైన వచ్చుఁగాక. 118

మ. తలి నాకోఁబదు లెప్పుడు ధనము చేతం గల్గి వర్తించు పు
ణ్యతపశ్శాలికిఁ గాక నిర్ధనునకున్నా కేల సిద్ధించు నా
సతిసంపర్క మవక్రవిక్రమవిరాజద్రాజదోర్దండమం
డితసామ్రాజ్యవధూటి చేరఁ జను నే నిర్భాగ్యదామోదరున్. 119

క. ధనమూలము జగ మంతయు
ధనవంతునిఁ గాని వేశ్యతల్లి దరిద్రున్
వనకూఁతుఁ జేర నీయదు
ధన మేడది దాని కొసఁగఁ దథ్యం బైనన్. 120

సీ. మునిఁడిమ్రాఁకున సైతమును బండ్లు గల్పించి
చెఱకున కేల సృజింపఁ డాయె
బూతగడ్డకు సైతమును గంధ మొనరించి
కుందనంబున కేల కూర్పఁ డాయె
బొలమురాళ్ళకు సైతమును బువ్వుఁ గల్పించి
శ్రీగంధమున కేల చేర్పఁ డాయెఁ
బుట్టకొవుల సైతమును దేనె గలిగించి

గేదంగి కేల గల్గింపఁ డాయె

గీ. ధర నిరక్షరకుక్షుల ధనులఁ జేసి
విద్య గలవారి నేల దుర్విటులఁ జేసె
బ్రహ్మ నన నేటి కతని నేర్పరిగ నెంచి
పుడమి వర్ణించు కవులఁ జెప్పెడిది గాక. 121

ఆ. తమకు నేమి త్రవ్వి తల కెత్తి రమరు లీ
యుర్విమనుజు లేమి యొసఁగ రైరి
నింగి వారసతుల నిర్మాతృకలఁ జేసి
పుడమి మాతృభూతముల సృజించె. 122

క. నల్లిగలశయ్యనిద్రయుఁ
జిల్లిగలఘటంబు నందుఁ జేర్చిన నీరున్
దల్లిగల వేశ్యఁ దగిలిన
పల్లవు సుఖములును బోధిపల్లవ సఖముల్. 123

క. లతకూనలు జవ్వనమున
వితతంబుగ వార్ధకము ప్రవేశం బైనన్
శతకంచుకంబు లూడ్చిన
కృతకఫణుల్ వారసతులు కేవల మరయన్. 124

సీ. ధనము కొప్పెరదండఁ బెనుభూత మున్నట్లు
గంగదరి మొసలి గాచినట్లు
రసకూపమున నంటి రాకట్టు గలయట్లు
మొగలి పువ్వున ముండ్లు మొలచి నట్లు
అమృతకుంభము నగ్ని యావరించిన యట్లు

శ్రీగంధమునఁ బాము చేరినట్లు
తేనెతెట్టెకుఁ జుట్టు రా నీఁగ లున్నట్లు
పట్టెకంకటి నల్లి పట్టినట్లు

గీ. అవని వేశ్యలపేరి శ్రేయస్సులకును
నల్లు లనియెడి విఘ్నాధిదైవతముల
విధి విచారము లేక యెవ్విధి సృజించె
వేశ్య రతిసౌఖ్య మెఱుఁగనే వేదజడుఁడు. 125

క. లోలత విటుఁ డైనం దా
నేలా తల్లుల సృజించు నిటు వేశ్యలకుం
గీ లెఱుఁగక చెఱిచెను విధి
కూళయి గొడ్రాలు బిడ్డకు ట్టే మెఱుఁగన్. 126

గీ. బ్రహ్మచర్యంబునకు నంతరాయ మొదవె
జలజముఖి మైత్రియును గొనసాగ దయ్యె
వసుధఁ బరికింప నిది సుమీ వ్రతము చెడ్డ
సుఖము దక్క దటన్న వచోనిరూఢి. 127

గీ. ప్రాగ్భవంబునఁ జేసిన పాతకంబు
నతను సంతాపమను పేర ననుభవింపఁ
జేయుచున్నాఁడు శ్రీరంగశాయి వగవ
నేల కర్తృయం బాట మేలు గాదె. 128

ఆ. శతభిషగ్వరుండు సకలౌషధీనాథుఁ
డమృతధాముఁ డిందిరానుజన్ముఁ
డట్టి రాజు రాజయక్ష్మచేఁ గృశియించుఁ

గర్గ మనుభవమునఁ గాక తెగునె. 129

మ. నిల దీయంగము రంగనాథవరమేని న్వేఁడెద న్నన్నహీ
సలిలాగ్నిశ్వసనాభ్రతత్త్వముల నాచంద్రార్కస్య నెమ్మేనఁ దో
య్యాలి ఘూర్ణాంబుల నింతి నేత్రములఁ గీరాలాపప్రాణంబులన్
జలజాతేక్షణ మేనిలోనిబయలన్ సాయుజ్య మొందింపవే. 130

## విప్రనారాయణుఁ డాపన్నివారణకై శ్రీరంగమూర్తిని స్మరించుట.

వ. అని ప్రార్థించి యాపద్ధరణంబునకు హరిచరణస్మరణంబ శరణం బని నిటలతటఘటితాంజలి యై యిట్లనియె. 131

ఆ. రంగ రంగనాథ రంగేశ రంగేంద్ర
రంగశాయి యో పురాణపురుష
నీకృపావిభూతి నీబంటుబంటుల
పాదధూళి మీఁదఁ బరఁగఁ జేయు 132

వ. అని వేఁడిన. 133

సీ. అక్షీణకరుణాకటాక్షవీక్షణరమా
రక్షితాపాంగసారంగవిభుఁడు
బర్హిర్ముఖాహారపశ్యతోహరగరు
ద్రథసార్వభౌమతురంగవిభుఁడు
శయనీభవత్సహస్రఫణామణిప్రభా
రాజిరాజత్తనూరంగవిభుఁడు
బహుముఖబ్రహ్మాండభాండకాండాంతశ్చ
రాచరావలిబాహ్యరంగవిభుఁడు

గీ. మానస మతీతవిస్తృత మస్తథప్ర
హారసంతాపితాభీరచారుభీరు
బృందసహకేళిధామకళిందజాత
రంగరంగద్విభుఁడును శ్రీరంగవిభుఁడు. 134

సీ. శరణాగతావనస్ఫురణాసముల్లస
త్కరుణాకటాక్షు కింకరశుభుండు
కమలాకుచద్వయీ విమలానులేప కుం
కుమలాలితాంక వక్షోవిభుండు
ప్రపదానిశానత త్రిపదానసాధిప
ద్విపదానవాహితాధికవిభుండు
శతకోటిరవివిభాతతికోటిహేతిని
ర్జితకోటిమానవారిప్రభుండు

గీ. శక్తిహీవత వేశ్యానురక్తిఁ బొరలు
భక్తు పరితాప ముడుప నుద్యుక్తుఁ డగుచు
రంగదాత్మాంఘ్రి నర్తకీ రంగదంత
రంగ వాంఛాప్రదాయి శ్రీరంగశాయి. 135

సీ. వెడఁద నెక్కొన్న దుటిపై వెదురాకు వెలుపుతో
దిద్ది తీర్చిన పట్టెతిరుమణియును
నామంపుఁ బట్టెల నడుమ శుద్ధ సువర్ణ
వర్ణమై తనరు శ్రీచూర్ణరేఖ
కంబుకంఠమునఁ బంకరుహాక్షమణులతో
భాసిల్లెడు తులసిపూసపేర్లు
నడునెత్తి పొక్కిలినడుమంత నిడుపుతో

సంవ్యాన మగు నొంటిజన్నిదంబు

గీ. క్రొత్తపెన్నూలి మూంజిఁ గీల్కొలిపినట్టి
పసపుఁ గౌపీనమును బచ్చపట్టుతడుపు
నమరఁ జిన్నారి చిఱుతపాయమున మున్ను
జగతిఁ బలి వేఁడి నట్టి వేసముధరించి. 136

క. సారమణిఖచిత మగు బం
గారపుఁ దనగిన్నె వారకామిని కొసఁగన్
శ్రీరంగ దివ్యధామ వి
హారుఁడు స్వయ మర్థచోరుఁ డై కొనిపోయెన్. 137

శా. కల్యాణైకనిదాన దానహత విఘ్నత్రాస వత్కర్తృతా
చ్ఛల్యర్క్షేంద్రవితాన తానవయుత శ్రీపద్రజఃపోషితా
హల్యాశాపనదీన దీనజనరక్షాశాహరోద్భూత శా
సల్యాగర్భనిదాన దానవహరా సౌరాన్వయగ్రామణీ. 138

క. బర్హితురంగమ జనకస
మర్హాధనుర్దళన యాభియాత్రావేశా
నిర్హేతుక గౌతమముని
గార్హాస్థ్యాపాదపాద కమలవినోదా. 139

మాలినీవృత్తము. ఉదితసుఖతరంగా ♦ యుద్ధధీరాంతరంగా
పదవిమలితగంగా ♦ భవ్యతేజోయుగంగా
విదితకపితురంగా ♦ విద్ధమాయాకురంగా
ప్రదరనిధినిషంగా ♦ భక్తభావానుషంగా. 140

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర
శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగు నృసింహ
మంత్రితనూభవ పరిచిత భగవద్భాగవతకైంకర్య
విధాన తమ్మయాభిధానప్రణీతం బైన
వైజయంతీవిలాసం బను మహా
ప్రబంధంబునందుఁ దృతీ
యాశ్వాసము.

# వైజయంతీవిలాసము

## (విప్రనారాయణచరిత్రము)

### చతుర్థాశ్వాసము.

క. శ్రీత్రిభువన జీవస్తుతి
పాత్రావయవప్రసన్న భావవిరాజ
ద్గాత్రపరిచారకాధిక
చిత్రితమునిచిత్తధామ శ్రీరఘురామా. 1

వ. అవధరింపు మట్లు దేవదేవి గృహంబుఁ బ్రవేశించిన నతనిం గనుంగొని
యవ్వేశ్యమాత యిట్లనియె. 2

ఆ. ఎందునుండి వచ్చి తెవ్వరాయనవు పే
రెద్ది యిటకు రాఁ బనేమి యనిన
వేశ్యమాత కనియె విజనకాలాశ్రయీ
కృతవటుండు శాంబరీవటుండు 3

ఉ. ఓయలివేణి యిప్పరిసె యుండుదు నన్యుఁడఁ గాను విప్రనా
రాయణుకూర్మిశిష్యుఁడను రంగఁ డటందురు పేరు మీకు నేఁ
డాయన పంపినాఁ డొకయనర్ఘ్యసువస్తువు కొమ్మ యందుకో
మ్మా యని గిన్నె నిచ్చె వెడమాయలవెల్లికి లంజెతల్లికిన్. 4

చ. సతతము బ్రహ్మరుద్రసురసంయమిముఖ్యుల నాత్మమాయ మో
హితులుగఁ జేయు సామి వెలయింతిని మోహితఁ జేయ లేక ప్రా
కృతజను నట్ల తాను దనగిన్నె నొసంగెను బంటుకోస మై
మతకరి వేశ్యమాత వెడమాయ లజేయలు విష్ణుమాయకున్. 5

వ. ఇట్లు గిన్నె నొసఁగినఁ గైకొని ప్రమోదమానమానస యై యతని నంతర్గృహంబునకుఁ దోడ్కొని చని నూత్నరత్నకంబళాస్తరణంబున సుఖాసీనుం గావించి. 6

గీ. జాలవల్లిక తోడ బాగాలుఁ దెల్ల
నాకులును గైరవళ్ళు గంధాక్షతములుఁ,
గప్పురముఁ బైఁడిచెఱఁగులదుప్పటియును
నెదుటఁ బెట్టిన నప్పటుఁ డిట్టు లనియె.

క. ఓకామిని విడె మేటికి
మాకు సదా వటువునకును మహినిది మీరు
న్నా కొసఁగ రాదు మేముఁ
గైకొన నుచితంబె యనినఁ గామిని పలికెన్. 8

క. మీ రొల్ల కున్న మీయయ
గారికి నిం డనిన నతఁడు గణికాంబికతో
వారికి నిచ్చుట మా కప
చారము వారలును బ్రహ్మచారులు గారే. 9

వ. అనిన వేశ్యాంబ వటున కిట్లనియె. 10

క. ఆయన బ్రహ్మచా రి
ట్లాయెను మాయింటిరాయఁ డై వీడియముం

జేయునె యనవుడు నతనికి
మీయింటనె యిదియు నిండు మెచ్చది మాకున్ 11

ఉ. మ్రొత్తిత వోలె మాపడుచు మేమును మా ర్తసలన్ మిటారినిన్
వెఱ్ఱితనానఁ బాయ వని వేడ్క నిటాడఁగ నింటనుండి దాఁ
జిఱ్ఱునఁ గోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచి పోయె మీ
వెఱ్ఱియగారు మంచిగురువే గలిగెం జదు వెట్లు చెప్పనో. 12

చ. అలుకలు చాలు రమ్మనవయా యయగారిఁ దమమ్మ కింత బు
ల్పులకుఁ బ నేమి తాఁ దొలఁగిపోయిన యప్పటి నుండి పిల్లయుం
బలుకదు మమ్ముఁ గూడి పెనుబండుగ నిట్టి వి దేటి కింటిలోఁ
గలక లటంచుఁ బల్కె నసఁ గైతవమాణవకుండు దానితోన్. 13

క. నే రమ్మనిన న్వచ్చునె
మీరలె పిలువఁ దగుఁ గాక మీ యల్లునిఁ దో
తేరఁ దగువారిఁ బంపుఁడు
మీ రెఱుఁగని తగవు గలదె మేదిని యందున్. 14

క. నావుడు న వ్వేశ్యాంబిక
యా వటునిం జూచి పిలువ నంపఁగ లే మ
య్యా వింతకాఁడు తా నెటఁ
బోవును తా వెఱుఁగ మెటుకుఁ బోదు మటన్నన్. 15

ఉ. ఏయెడ కేల పోవు నతఁ డెవ్వరి కైనను జిక్కువాఁడె తా
నాయన మీకు నీవఱకు నచ్చిన యప్పటు దిద్ది తా సుఖో
పాయతఁ నున్నవాఁడు శ్రుతి పాఠము సేయుచుఁ దోటలోన నే
మాయయగా రటంచు నల మాయయగా రరిగెం దటాలునన్. 16

క. దయ యెటువంటిదొ రంగే
శయునునకును దాసుసై నిజశ్రీపాద
ద్వయిఁ దద్వేశ్యాగారము
గయకం కెఁ బవిత్రితంబు గా నొనరించెన్. 17

గీ. అటుల వటుఁ డేగ నంత నక్కుటిలమతులు
పసిఁడిగిన్నియఁ జూచి యప్పాలు కేడ
దిట్టి వస్తువు మనలఁ గన్గట్టు నట్టి
రీతి వలె నున్నయది దీనిరీతి యనుచు. 18

క. చెన్నారు పసిఁడిగిన్నియఁ
గన్నారం గనియు నమ్మక పరీక్షార్థం
బన్నారీమణి లపు డది
సొన్నారిం బిలిచి తెచ్చి చూపించుటయున్. 19

గీ. అతఁడు నదిచూచి దానిపై నితత మైన
శంఖచక్రాంకములవిలాసంబు వలన
దేవ ధన మాటఁ దెలిసియుఁ దెలియనట్లు
గిన్నె మేలైన దిది పదాఱ్వన్నె పసిఁడి. 20

క. మీ వెలఁది కూడఁబెట్టిన
రో వెలఁ జేయించుకొంటిరో మీ కెవరో
రోవాటున నిడిరో యిటుల్
తా వెట్టిది యనిన వేశ్యతల్లి యతనితోన్. 21

సీ. మాదేవదేవి సహోదరియును దాను
నిఖిలేశ్వరుఁ డగు చోళనృపతిఁ గాంచి

యతనికి గీతాదిగతు లెల్ల వినిపించు
నవ్వేళ నోడబేహారి యొకఁడు
నృపతికిఁ గిన్నెఁ గానికఁ జేసి పాడగన్న
సంగీతవిద్యాప్రసంగవేళ
వచ్చిన దగుట నవ్వసుమతీనాథుండు
నుచితజ్ఞుఁడై మూకు నొసఁగె ననిన
గీ. దాని కపటోక్తులకు నట్లు తప్ప దనుచు
వాఁడి మెయికొని యేదాత యీఁడు మీకుఁ
గోరినపదార్థ మని తాను వారిఁ బొగడె
బాహిరంబున నాపశ్యతోహరుండు. 22

వ. తదనంతరంబ. 23

క. వీడెము గంధము నిడి యా
నాడింధము ననిచి తజ్జనని సుతతో నో
చేడియ యిన్నాళ్ళుఁగము
బోఁడఁడు బంగారుపెట్టెపో పరికింపన్. 24

గీ. ఇంత బంగారుగిన్నియ సంతరించు
వాఁడు దీనికి జోడైన పైఁడిపళ్ళె
రంబు చిటిపొటిగిన్నెలు చెంబు సంత
రించకుండునొకో యమ్మ యెంచుకొమ్మ. 25

గీ. మండగుడిపేరి నగరాన నుండు నితని
తండ్రి లక్షాధికారి యాతఁడు గడించి
నట్టిసొమ్ములు గాఁబోలు నిట్టి వెన్ని

గలవు యన్నియు నెయ్యన వలయుఁ గొనఁగ. 26

వ. అని యతని మగుడఁ బిలువఁ దలఁచి. 27

## విప్రనారాయణుం దోడ్తేర వేశ్యమాత కావేరింబుచ్చుట.

క. శ్రీరంగిఁ బంపుదమొ మన
గౌరిం బంపుదమొ యంబికం బుత్తెమొ కా
వేరిం బంపుదమో యె
ల్లారిం బంపుదమొ యని తలఁచి వారలలోన్. 28

క. ఆరయ సమయోచితవా
చారచనప్రౌఢి మిగుల నడిసన్నది కా
వేరియ కుంటెనపనిఁ గడి
దేరినయది పంప వలయు దీనినె యనుచున్. 29

సీ. గమకించుచమరివాలము లోనఁ గీలించి
యుప్పరంబుగ నోరకొప్పు దిద్ది
నాభినామంబు నెన్నడుమఁ గస్తురిరేఖ
మోసుగాఁ బాపట మోయఁ దీర్చి
తాటంకవలయమధ్యమునఁ జెందొవపువ్వు
లవతంసకముగాను హత్తుకొల్పి
మడుఁగుఁ జెంగావిపావడ మీఁద వెలిపట్టు
చీర కుచ్చెలు నేలఁ జీఱఁ గట్టి

గీ. మెఱుఁగుఁదీగయుఁ బెద్దముక్కఱయుఁ బెట్టి
దండతాయెతులును సందిదండ లునిచి
కేల గాజులు గాడ సరాలు దొడిగి

ప్రేమఁ గైసేసి యద్దాసిఁ బెంపు చేసి 30

వ. అప్పు డమ్ముదుసలి యిట్లనియె. 31

గీ. ఏనపుడు కోపగించుకొం చిల్లు వెడలి
పొమ్మనిన నట్లు దాసరిబోడ పోయి
తోఁటలో నున్న వాఁ డట బోఁటి నీవు
సమ్మతిలఁ బల్కి యతనిఁ దోడ్తెమ్మటన్న. 32

క. అమ్మాటకు నది యిట్లను
సమ్మతి కా కేమి పిలువ సమ్మతి గాదా
ర మ్మని యంటేఁ జాలును
బమ్మఁడు నా వెంటఁ బెద్దపరుగున వచ్చున్. 33

క. వలపు గల యంటుగానికిఁ
బిలుపే దేవేంద్రపదవి ప్రియురాలు దను
న్బిలిచెనువార్తవిన్నను
నిలిచినచో నిలువ నేర్చునే నిముసంబున్. 34

వ. అది యెంతపని యిప్పుడే తోడితెత్తు నని చని యవ్విప్రనారాయ
ణుం గనుంగొని యిట్లనియె. 35

గీ. దొంగ వలె వచ్చి యిచ్చట దాఁగినావ
దేమయా బావగారు పెద్దామె కోప
గించినందులకా బళా మంచివాఁడ
వేమ నందును ముసలాపె యేవివేకి. 36

ఆ. అప్పు డిల్లు వెడలి యటు వీధికై నీవు
పోవ దేవదేవి పొగిలి మిగులఁ

వల్లిఁ గోపగించి మళ్ళిఁ బిల్వ మటంచు
నంపె నన్ను నీవు నంతలోన. 37

ఉ. ఎక్కడఁ బోయితో యెఱుఁగ కేనును వెంటనె వచ్చి యప్పు డే
దిక్కున నిన్నుఁ గానక మది న్వెఱగందుచు దేవుఁడాన నీ
బిక్కిర మెత్తు నయ్యఱపిళ్ళలవాడల నింతసేపు నీ
యిక్కువ లన్నియు న్వెదకి యే నిట వచ్చితి లేచి రావయా. 38

వ. అనిన నతం డి ట్లనియె. 39

క. రమ్మనెనా మఱి యే మనెఁ
బిమ్మట నీయక్క నీకుఁ బెరయూళ్ళా నే
యమ్మ నదల్చెనె యాబిడ
సమ్మతినే వచ్చినావొ సకియరో చెప్పుమా. 40

క. మీయక్క పిలువు మనెనో
మీయమ్మయుఁ బిలువు మనెనొ మృష లాడితివా
మీయక్కతోడు నీకుఁ
మీయప్పకుఁ దప్పదువు సుమీ కావేరీ. 41

క. అని మఱియు మఱియు ని ట్లడి
గినమాటలె యడుగఁ బ్రియసఖీవార్తల నూ
తనతం బునరుక్తముగా
వినునది కాముకులమదికి వేడుక గాదే. 42

## విప్రనారాయణుఁడు మరల దేవదేవియింటికిం జనుట.

క. మధురములు సతుల వలపులు
మధురంబులు సతులముద్దుమాటలు మిగులన్

మత్సరము తా వలచిన సతి
మత్సరములు తదీయదూతిమాటలు మఱియున్. 43

వ. ఇవ్విధంబున శపథపూర్వకంబుగాఁ దన్ను నడిగిన నవ్వడుగునకు వినయసంభ్రమంబున గంభీరవాగ్విజృంభణంబుగా నా శంభళి యిట్లనియె. 44

క. మాయక్క పిలువు మనియెను
మాయమ్మయుఁ బిలువు మనెను మాయయతోఁడే
మాయంబికమ్మయానే
వే యిఁకఁ బదవయ్య యేల వేదనఁ బొరలన్ 45

వ. నావుడు నతండు తన మనంబున 46

క. రమ్మనక పోదు తాత్ప
ర్య మ్మధికముఁ దేవదేవి కది సహజంబే
యమ్ముసలిచేరజ మ్మది
రమ్మనె నను మాట నమ్మరా దెప్పటికిన్. 47

ఆ. ముసలిదానిమాట వెస నమ్మి పోరాదు
పోవకుండ రాదు దేవదేవి
రమ్మనంగ దీని కెమ్మెయి నుండుఁ గా
ర్య మ్మటంచు సంశయమ్ము నొంది 48

గీ. దైవయత్నము లేక చెందవు శుభాశు
భములు దైవంబుఁ బరిహరింపంగ రాదు
కానఁ బ్రారబ్ధకర్మంబు దీని కేమి
కొంచ యైనట్టు గానిమ్మటంచుఁ జనియె. 49

వ. ఇట్లు చనుదెంచిన యాతనిం గనుంగొని దేవదేవి యిట్లనియె. 50

ఉ. ఆమె మఱేమి మంచి గురువౌ యయ్యగారవె యట్లుపోదురా
మాయలవానికి న్వలపు మాయమటన్నది నిక్క మయ్యె ము
న్నాయమ యేమటన్న నగవై వినుచుందురు గాని పాటిగాఁ
జేయరు శాంతి దాంతి గుణశీలురు మీ రలుగంగఁ జెల్లునే. 51

క. నా పేరఁ బెట్టి నిన్నును
నీ పేరం బెట్టి నన్ను నిష్ఠురములు గాఁ
జాపలము లాడు నేకద
లోపలి లాహిరి జలంబులం దొలఁగింతుఙ్. 52

క. మొదలె సివవెట్టి యటుపై
ముదిమది వెసఁ దప్పి కోపమున నాడిన నీ
వది యెఱుక చేసికొని యలు
గుదువా నేఁగాక యామె గుఱుతా నీకున్. 53

వ. అని యిట్లు దేవదేవి యూరడించినఁ దదీయాంబ చనుదెంచి యిట్ల
ట్లనియె. 54

ఆ. నవ్వు చేసికొండ్రు నామాట కలుగరు
వృద్ధటంచుఁ బెద్దపెద్ద దొరలు
దేవరట్లు మీరు శ్రీవైష్ణవులు మాయ
పాస్తవాక్య మెగ్గు పట్టఁ దగునె 55

వ. అని యివ్విధంబున నవ్వృద్ధపిశాచి యతిశాంతురాలై సాంత్వనవచ
నంబులు పలుకం గనుంగొని యతం డంతరంగంబున నది యంతయు
దేవదేవికిఁ దనయం దనురక్తి గలుగుట నెఱింగి పుత్త్రిక నతిక్రమిం

పలేక ప్రియోక్తులాడుటగా భావించుకొనియె నదియునుంగాక.

క. కేవల పైత్యభ్రాంతుఁడు
భూవలయము దిరుగు నన్న పోలిక వసుఁడై
తా వలచినట్టివానికి
స్త్రీ వలచినయట్టు లుండుఁ జిత్తములోనన్. 57

వ. అనంతరంబ. 58

గీ. విటశిఖామణి యైన య వ్వటుశిఖామ
ణికిని సంపెఁగ నూనియ నెలఁత శిరసు
నంటెఁ గేల్దోయి తాళంబు లటిశయిల్ల
బోఁడితలమీఁద దాండవం బాడుచుండ. 59

గీ. అవ్విధంబున శిర సంటి యంగమర్ద
నంబుఁ గావించి మాషచూర్ణంబుఁ బ్రామి
మజ్జనం బార్చి చెంగావి మడుఁగు లిచ్చి
నామములు పెట్టుకొనఁ జేసి ప్రేమ నతని. 60

గీ. గంధకర్పూర కస్తూరికా విలేప
నాదుల నలంకృతునిఁ జేసి యవలఁ దాను
శిరసు మజ్జన మాడి నల్వరుస వన్నెఁ
దీర్చుకొని త న్మనోవాంఛఁ దీర్చె నంత 61

## బంగారుగిన్నె లేదని యర్చకులు జియ్యరున కెఱిఁగించుట.

మ. అట రంగేశ్వరు నర్చకుల్ని యత మా న ద్దేవు మధ్యాహ్నమ
ప్పుటినైవేద్యమువేళ దేవళములో బంగారపుంగోర నె
ప్పటిచోఁ గానక చంచలాత్ము లయి లోఁ బల్మందసం బాదిగాఁ

దటసంస్థానము లెల్లఁ జూచి యటుపైఁ దత్పాత్ర లేకుండినన్. 62

గీ. వారలును దేవళపుటధికారి యైన
జియ్యగారికి విన్నవించిన నతండు
నదరిపడి లేచి మఱియును వెదకవలయు
పట్లరసి యెందుఁ గానక పరితపించి. 63

క. గిన్నె యిటు మున్న దేవర
సన్నిధి నేఁ గంటి వింతజను లీలోనే
కన్నపుదొంగలు వచ్చిరె
మిన్నక యీలోనివారె మ్రింగి రటంచున్. 64

క. బడిపనులవారి గొల్లల
గుడినంబుల జంగవరుసఁ గొని చేకొలఁదిన్
బడిమారెఁ ద్రిదండంబున
నెడమఁ గుడి న్నారసింహ మెత్తిన రీతిన్. 65

గీ. ఇట్లు కోలాహలంబుగాఁ బెట్లఁ బెట్టి
వీఁక నందఱ నచట మెయ్యాఁక చేసి
ముమ్మర మ్మైన యూరివేరమ్ము మదికిఁ
బుట్టి యతఁ డేగెఁ దలవరికొట్టమునకు. 66

సీ. కనముక్కుపై నుండి కనుబొమ్మలకు వెళ్ళ
నాభినామంబు సన్నముగఁ దీర్చి
చెవిచెంత కొరగ వేసిన కోరసిగసందు
తెల్లచెంగులబట్ట వెళ్లఁ గట్టి
యనుకువేళ్ళను గంధమును నాభినుండి మూఁ
పుల దాఁక బంగారుపూఁతఁ బూసి

చెఱఁగుదిక్కునఁ దోఁక చెఱఁగు దూలఁగ నీలి
కాసెచే హనుమంతుకాసె వేసి

గీ. తొడవుఁ గత్తులు గుదెలును గడల నొంటి
పోకవీడెము లమర మైతే కరముల
నొంటరులు గొల్వ దలవరి మంటపమున
నధివసించిన దండనాయకునిఁ గాంచి 67

వ. తీర్థప్రసాదంబు లిచ్చిన నతండు ప్రత్యుత్థానంబు చేసి యందుకొని
వేంచేసినప్రయోజనం బేమి యని యడిగిన నతం డిట్లనియె 68

గీ. అవసరము లెల్ల ముగియ ననంతరమున
రాత్రి పవళించువేళ శ్రీరంగశాయి
యానవా లారగించు పదాలువన్నె
బంగరపుగిన్నె పోయెను బట్టపగలు. 69

క. అసన్నత స్వామికి నిజ
దాసుఁడ వైనట్టి నీవు తలవరిపని యా
జ్ఞాసిద్ధిఁ జేయఁ గోవెల
లో సొమ్మిటు లైన నిన్ను లోకులు నగరే. 70

ఉ. పోనెడ లేదు గిన్నెఁ గొనిపోయినముచ్చులు నూరు వెళ్ళకే
లోనె యడంగి యుండ్రు పురిలో వెదకింపుము చీఁకటిం బర
స్థానము సేయకుండ నిఁక సన్నిధి మా కపరాహ్ణ కాలసే
వానియమం బటన్నఁ దగువారలఁ బంపి యతండు చయ్యనన్. 71

గీ. ఊరఁ గల్గిన యగసాలివారి నెల్ల
నింటివద్దికి నొండొరు నెఱుఁగ కుండ
రేయిఁ బిలిపించి శ్రీరంగశాయిగిన్నెఁ

దస్కరుఁడు దీసినట్టి విధంబుఁ జెప్పి. 72

క. కంచును రాగియు వెండియుఁ
గాంచనమును మౌక్తికాదికము లగు మణులుం
బంచాణమువారిండ్లకుఁ
గొంచక కొనివత్తు రమ్ముకొనుటకుఁ జోరుల్. 73

క. అట్టియది మాకు నెవ్వఁడు
నెట్టన నెఱిఁగించు నాతనికి నిచ్చెద నేఁ
గట్టిన యీ దుప్పటి నే
నెట్టియెడం బ్రచుర మతని నెన్నఁడుఁ జేయన్. 74

వ. ఇట్లు పట్టణంబునం గల లోహకారకుల కెల్లఁ బ్రత్యేకంబుగా రహ
స్యంబునం జెప్ప నట్టియెడ. 75

గీ. అందు వేశ్యాగృహంబున హైమపాత్రఁ
గన్న యగసాలిబత్తుఁ డాగిన్నె సుద్ది
నేకతంబునఁ దలవరి కెఱుకఁ జేసి
చనియె ఘనమైన మెచ్చుఁ గైకొని ముదమున. 76

వ. దానికిఁ బ్రమోదమానమానసుం డై తలవరియును నమ్మఱునాఁ డరుణో
దయంబున. 77

సీ. చలదయఃపత్త్రికోజ్జ్వలదండకాండముల్
ఘలుఘల్లు మనుచు ముంగలఁ జెలంగ
నునుపారఁ జికిలిచేసిన విచ్చుకత్తులు
తపనదీప్తులఁ దళ తళ యనంగ
హనుమదాకృతులు వ్రాసిన కంచుటరిగలు

జాళించు రవళిచే డాలు మించ
నదరుఁగ్రోవులమ్రోఁత కదరి నల్దిక్కుల
నార్తరావముల వాయసము లరుగ
గీ. ముందటను గంచుకొమ్ము మిన్నందిమొరయ
జారచోరుల గుండియల్ జల్లనంగ
వెడలి కోలాహలంబుగా వేశవాటిఁ
జేరి యప్పట్టణము తలవారి గాంచె. 78
వ. అందు. 79
సీ. ఎఱమట్టిపూఁతచే మెఱుగారుగోడలఁ
బైక్రింద సున్నఁపుఁబట్టెయలును
ద్వారబంధమున సిందూరంపుబొట్లును
గడపపైఁ బసపు నక్షతలచాలు
భిత్తిభాగమునఁ గ్రొన్నెత్తురుజిట్టలు
చూరుల మాంసంపుఁదోరణములు
తీన్నెపై నంబికాదేవిపాత్రంబులఁ
బూజచేసిన మద్యపూర్ణఘటము
గీ. గలిగి ఘనసారకస్తూరికాసుగంధి
గంధపుష్పాక్షతార్చనబంధురాభి
నవకలశభాసి గృహదేవభవనసూచి
తేందిరం బైన యావేశ్యమందిరంబు. 80

దేవదేవియింట బంగారుగిన్నె దొరకుట.

వ. కని తదీయ బహిర్ద్వారప్రదేశంబునఁ దాను నిలిచి పరివారజననివ

హంబునం దద్గృహంబు శోధింపం దగువారిఁ బనిచినం జని వారును.

క. అందులఁ దగిన గృహంబుల
కందువ లన్నియును వెదుకఁగా నొకచోటం
జందనపు మందసంబునఁ
గుందనపుంగోరఁ గాంచి కొని చని దానిన్. 82

క. తలవరియెదుటం బెట్టిన
నల వేశ్యఁ దదీయమాత నగ్గిన్నియ జి
య్యల కడకుం గొని చనఁగా
లలనామణితల్లి వారలకు నిట్లనియెన్. 83

క ఇటు లే మనెఱుఁగ మేమియు
విటుఁ డొక్కఁడు గిన్నె మాకు వేడుకతోఁ దా
నిట దెచ్చి యిచ్చి యింటను
విటుఁ డై యున్నాఁడు దగ వివేకింపవయా. 84

వ అన విని యత్తలవరి యతనిం దోడితెం డని నిజభృత్యులం బనిచినం జని వారలు తదీయ శయనాగారంబున నున్న యవ్విప్రనారాయణుం గనుంగొని. 85

క. దండము దండ మిదెవ్వరు
తొండపరడిప్పాడులు గిన్నెదొంగ గైనారో
రం డిట వేంచేయుఁడి వే
దండ మిడన్ వచ్చినాఁడు తలవరి మీకున్. 86

తలవరి విప్రనారాయణునిగిన్నెతో జియ్యరుకొప్పగించుట.

క. అని బహువిధముల సొల్లుం

తసముల నాడుచును దొంగ నా సామీ గొ
బ్బున వేంచేయుం డనుచును
జని యతనిం జియ్యగారి సమ్ముఖమునకున్. 87

వ. తోడ్కొని చని యత్తలవరి వారల నక్కనకపాత్రంబులో జియ్యల
కొప్పించిన నతండు వేశ్యం గనుంగొని యగ్గిన్నియ మీకు నేక్రియం
జేరె నెఱింగింపు మనినన విప్రనారాయణుంజూపి యది యిట్లనియె

సీ. ఈదాసరయ్య తా నేఁడాది నుండి మా
దేవదేవికి విటుఁడై వసించుఁ
దోఁటలో భిక్షు మెత్తుచుఁ బసాపడుచున్న
వాని నింటికిఁ దెచ్చె వలపుచేత
నెదురు పెట్టును గాని యెఱుఁగ మీతనివంకఁ
బడెడు బియ్యము స్వయంపాకమునకు
నెన్నఁడు విడె మైన నియ్య వటంచును
నేననఁ గోపించి యిల్లు వెడలి

గీ. పొమ్మనినఁ బోయి యొక చిన్న బ్మచారి
చేత గిన్నియఁ బుత్తెంచె నాతఁ డితని
శిష్యుఁ డనియెఁ బరామరిసించుఁ డనిన
విప్రనారాయణుఁడు సభాపతి కనియె. 89

క. నా కెక్కడి శిష్యుఁడు నే
నేకాంగిని లెస్స తెలియుఁ డిది నిజ మైనన్
శ్రీకాంతుని గిన్నియ నే
నీ కాంతకుఁ దెచ్చి యిచ్చు టిదియును నిజమే. 89

క. ఈమాటే గతి సేయుఁడి
యేమాటలపం బనేమి యిఁక నాపుడు న
జ్ఞామాతమాటలన వే
శ్యామాత సరోషచేత యై యి ట్లనియెన్. 91

గీ. రంగఁ డను పేరు సైత మెఱుంగఁ జెప్పి
యవ్వడుగు శిష్యుఁ డను నే నటంచు వచ్చె
నతనిఁ గడుఁగట్టిచేసెను ననువుదొంగ
కేది గతి కల్లకో నిజ మెట్లు దోఁచు. 92

క. తనవంటిపిల్లసికయే
తనకుం బలెఁ దులసిపేర్లు తనవలెనే చా
దిన తిరునామము రూపీ
తనివంటిది గాదు నలు పతం డరయంగన్. 93

చ. వడి నదలించినం బడుచువాఁడు భయంపడి యేడఁ జెప్పనో
తొడిఁబడ నంచు వాని నిటఁ దోడ్కొని తేరక తానె వచ్చి యీ
గడుసరిదొంగ మ మ్మొడియఁ గట్టెడు శిష్యుఁడు తేఁ డటంచు మున్
గుడికడ దుష్టము ల్పలుక కొండొకశోధన దీని కెమ్మెయిన్. 94

చ. తెలివల మే మెఱుంగుదుమె తెల్లనివెల్లను బాలటందుమి
ట్లరయఁగ వేడ్కఁ గాఁ దగుచు నక్కట యీకొఱగామిచే మముం
జెఱుపనుపాయ మెంచి యిలు చేర్చెను దేవరసొమ్ముఁ దెచ్చి యీ
యపకువాసి యింతయురి యౌ నని కానక మోసపోయితిన్. 95

క. అని యిట్లు దేవదేవీ
జననీవాక్యములు విప్రసత్తముఁ డపు డా

డినమాటలు విని విద్వ
జ్జనముల నజ్జీయ్యర్ ధర్మసభఁ గూర్పించెన్. 96

వ. ఇట్లు గూడిన విద్వత్సభాజనులు గొందఱు విప్రనారాయణుం గ
నుంగొని. 97

చ. వటుఁడటె యగ్రజన్ముఁడటె వైష్ణవుఁడో యటె తాను గ్రమ్మఱ
న్విటుఁడటె దేవతాధనము వేశ్యకు ముచ్చిలి యిచ్చినాఁడటే
యిటువలె నౌనె భ్రష్టుఁడు హరీ జగదీశ్వర రంగరంగ యీ
కుటిలునిచేత వైష్ణవులకుం దలవంపులు చేసె దిక్కులన్. 98

మ. అభియాతు ల్మాద లీమతంబునకు మాయావాదు లా త్మీయదు
ర్వ్యభిచారం బది మేరువం తయిన మాయ న్మిథ్య లే దంద్రు వె
ల్లభియోగింపుదు రన్యదుష్కృతము గోరం తైనఁ గొండంతగాఁ
బ్రభువుల్ హాస్యరసప్రియు ల్మనల నీపా లైన మన్నింతురే. 99

వ. అని యిట్లు హరిదాసు లయిన శ్రీవైష్ణవ జనంబులు మనంబుల ఘనం
బగు ఖేదంబు లొందు చుండ నవ్వల నితరమతంబుల వా రతని
నుద్దేశించి. 100

ఉ. చోరుఁ డనంగ రా దొరులసొమ్ములు ముచ్చిలినం బ్రపన్ను నిఁ
జారుఁ డనంగ రాదు వెలుచం బరకాంతలఁ గూడ వీఁ డనా
చారుఁ డనంగఁ గూడ దనిశంబును వేశ్యలతో రమించినన్
బోరన మీర లీతనికిఁ బూనుఁడు బ్రహ్మరథంబు వైష్ణవుల్. 101

వ. అని సోల్లుంఠనము లాడు చుండి రాసమయంబున జీయ్యరు సభాస
దుల కి ట్లనియె. 102

గీ. పరఁగ దేవరసొమ్ము దేవరకుఁ జేరె

దొంగ యెటు వోయె నేమి యనంగఁ జెల్ల
దరసి శిక్షింప కుండిన నాత్మ పదిల
పడదు గావున మ్రుచ్చు నేర్పులుపవలయు. 103

## సభాసదులు విప్రనారాయణునకు శిక్ష విధించుట.

వ అని మఱియు వేశ్యాంబపలుకులును, విప్రనారాయణవాక్యంబులును
సభాంతరంబున సవిస్తారంబుగా వారలకుం దెలిపి ధర్మంబు లె
ట్లుండు ననిన వారలు దమలోన 104

గీ పెట్టలే దని తర్కించునట్టివిటుని
వేశ్య లూరక పిల్తురే విత్త మీక
హేమపాత్రికఁ జూచి కా కితని పట్టె
నామములు చూచి పిలిపించినారె మరల. 105

క ఏఁడాఁదిబట్టి వేడుక
కాఁడై యితఁ డింట నుండెఁ గాని యితరుఁ డే
వాఁడు న్లేఁ డని యూపూ
బోఁడి యనియె నితఁడు నట్లు పొందుగఁ జెప్పెన్. 106

క ఈయర్థంబున గిన్నియ
నీయన యీవలయుఁ గాని యితరులకు వృథా
రోయిడఁ బ నేమి యాదవద
సేయక యిది ధర్మ మని వచింపుఁడు పెద్దల్. 107

గీ. ఎవ్వరేనియుఁ గొనిపోయి యాక గిన్నె
నడిచిపోవదు వారింటికడకుఁ దానె
యొరులు గొనిపోయి యొసఁగఁ బ్రయోజనంబు

గలుగ దటుగాన నీతఁ డీవలయు దీని. 108

ఉ. కొంచక రేయునుం బవలుఁ గోవెల కేఁడు పువ్వుదండ ల
ర్పించు నెపంబునం బరిచరింపుచు నుండి నటుండి యొయ్య నే
పంచను బొంచి యర్చకులు వద్దఁ దొలంగిన సందుఁజూచి లం
కించఁగ నోపు నీ పసిఁడి గిన్నియ సంశయమేల దీనికిన్. 109

వ. అని నిశ్చయించి యవ్విప్రనారాయణునందుఁ జోరత్వం బాపాదిం
చి సభాసదు లందఱు నేకత్వంబున నత్తెఱంగు జియ్యకు నెఱింగించి
న విని యతండు దీనికిం దగు శాస్తి యెట్లుండు ననిన వార లిట్లనిరి

ఆ. ధనముఁ గొనుట యొండెఁ దల గొఱుగుట యొండె
నాలయంబు వెడల నడుచు టొండెఁ
గాని చంపఁ దగిన కార్యంబుఁ జేసినఁ
జంపఁ దగదు విప్రజాతిఁ బతికి 111

క. అని విజ్ఞానేశ్వరుని వ
చన మున్నది గాన నట్టి శాస్తి యొకటి యీ
యన కొనరింపం దగు న
య్యానువునఁ జేయించి పంప నగు నొండెడకున్. 112

ఆ. ధనము నెరయ లేదు తల మున్నె గొఱిగించు
కొన్నవాఁడు గాన నున్న తలఁపు
లుడిగి సీమ వెడల నడచుటె శాస్త్రోక్త
శిక్ష యితని కట్ల సేయుఁ డనుచు. 113

శా. ఈమాడ్కి న్నుడిజియ్యతోడ సభవా రేకోక్తిగా నాడఁగా
నామాట ల్వినుచు న్వినమ్రవదనుం డై విప్రనారాయణుం

డీ మే నేటికి దొంగనై చనిన నన్నెవ్వారు మన్నింతు రీ
సీమన్ సిద్ధుఁడె నాదు దేహము విసర్జింతు న్హరిప్రీతిగన్. 114

వ. అని యిట్లు తనుత్యాగంబునకుఁ గృతనిశ్చయుండై. 115

సీ. అరయు శీతాంశు సోదరియును నజుఁడును
వాలు నిల్లాలుఁ దొల్చూలు నగుచు
హరుఁడు నంబుజకులేశ్వరుఁడు సాగరుఁడును
దేహంబు వాహంబు గేహ మగుచు
నరుఁడు కంసతనూజావరుఁడును మరుఁడును
మిత్రుండు శత్రుండు పుత్త్రుఁ డగుచు
హేమంబు శిఖిపింఛదామంబు నామంబుఁ
బొంబట్టుఁ దలచుట్టు బొట్టు నగుచుఁ

గీ. కౌస్తుభమణీవరంబు గంగాఝరంబుఁ
గెంపుపతకంబుఁ బాదంపు సొంపు నగుచు
వెలయు నేదేవుఁ డాదేవు నిలిపె నాత్మ
రంగనాథుఁ ద్రిలోకాంతరంగనాథు. 116

వ. ఆసమయంబున. 117

### శ్రీరంగనాథుఁడు సభకు విచ్చేయుట.

సీ. నికటాత్త శశిభాను లోకట సహస్రహా
కరముల శంఖచక్రములు మెఱయ
శ్రీకాంత వక్షస్స్థలీ కౌస్తుభంబున
బంగారు ప్రతిమ నాఁ బ్రతిఫలింప
ఛత్త్రాయమాణ శేషఫణామణిప్రభ

దినానాథదీప్తులఁ బొనుగుపఱుప
వాహీభవత్ఖగేశ్వరకరశ్రయదంఘ్రి
సరదంబులకు సుర ల్శిరసు లొగ్గ

గీ. వాసవానలయమదైత్యవరుణవాయు
వైశ్రవణశర్వగీర్వాణవరులు గొలువఁ
గరుణఁ బ్రత్యక్ష మయ్యె భక్తవ్రజాంత
రంగవాంఛాప్రదాయి శ్రీరంగశాయి. 118

సీ. రభటిల్లు దివ్యదుందుభి నినాదంబులు
గంభీరగర్జావిజృంభణముగ
నటియించు నప్సరఃకుటిలాలకావళి
ప్రచురవిద్యుల్లతానిచయముగను
ప్రసరించు దేవతావిసరరత్నవిభూష
లమరేంద్రచాప విభ్రమములుగను
వడి రాలు పూదేనె జడివానసోనలు
ధారాళధారాంబు పూరముగను

గీ. విప్రనారాయణాత్మ భూమిప్రవృద్ధ
వేదనాగ్రీష్మసంతాపనోదనముగ
మెలఁగు నంబరచరులను మేఘతతులు
గురిసె నప్పుడు మందారకుసుమవృష్టి. 119

వ. అంత నవ్విప్రనారాయణుం డాదినారాయణు దివ్యమంగళవిగ్రహం
బు లోచనానందంబుగా సందర్శించి రోమాంచ కంచుకిత సర్వాం
గుండై సాష్టాంగ దండప్రణామం బాచరించి కేలుదోయి ఫాలభా

గంబునం గీలించి. 120

సీ. సతతత్రయీశిఖాచరణాయ శరణాయ
పావనాయ సురాధిపావనాయ
హరిదశ్వరజనీకృదక్షాయ దక్షాయ
శంకరాయ నిజాప్తశంకరాయ
సనకాదిహృదయరంజనకాయ జనకాయ
నాయకాయ గిరీశసాయకాయ
హేలాశయనకాశనేశాయ నేశాయ
కారణాయ సబాధువారణాయ

గీ. దేవ రంగేశ తే నమ స్తే నమోస్తు
దేవ మాం పాహి పాహి త్వమేవ శరణ
మన్యదైవం వినాత్వా మహం నవేద్మి
సర్వసాక్షీభవాన్ సమస్తమపి వేత్తి. 121

క. కుధరధనుర్ధరముఖ్యవి
బుధరాజస్తుత్య మిమ్ముఁ బొగడ నవిద్యా
త్మధరుండ నసర్థుఁడ నే
నధరస్పందన మొనర్ప నఖిలాధీశా. 122

క. నాపయిని దేవతావి
త్తాపహరణ నిందప్రాప్త మైనది దీనిం
బాపి విమలాత్ముఁ జేయు ద
యాపర లక్ష్మీశ త్రిభువనైకనివేశా. 123

వ. అనిన నద్దేవుండు కోవెలపారుపత్తెంబున నధికారి యైన జియ్యరున
కిట్లనియె. 124

క. లీలావినోదమునకై
యీలాగున నేను వీరి నిరువురి రతిరా
ట్కేళిం గూర్చితి మద్వన
మాలిక యితఁ డప్సరఃప్రమద యీ సతియున్. 125

క. గోవెలకు నేనె యిచ్చితి
నీ వెలఁదికి గిన్నె వేశ్య కిచ్చిన యది గై
కోవచ్చునె మరలఁగ నా
యీపెకిఁ దిరు గందుఁ గలదె యుండదె మరలన్. 126

వ. అని యానతిచ్చి సకలజనులు గనుంగొన నయ్యాదినారాయణుండు విప్రనారాయణు శరీరంబునఁ బ్రవేశించె నందుల కాశ్చర్యధుర్యులై యఖిలజనంబు లతని కత్యంతభయభక్తివినయసంభ్రమంబులం బునః పునరభివందనంబు లాచరించి రంత. 127

గీ. బ్రహ్మసభ యెల్ల భక్తి నప్పరమవైష్ణ
వోత్తముని బ్రహ్మరథమున నునిచి పట్ట
ణమున కేతెంచి రధికసంభ్రమము మీఱ
జియ్య ముందటికొమ్మునఁ జేరి మ్రోవ. 128

గీ. ఇవ్విధంబునఁ బట్టణం బేఁగి రంగ
ధాము సన్నిధి కరిగి యతండు దండ
వత్ప్రణామంబు లిడి తిరువాయిముడిప్ర
బంధసూక్తుల వినుతు లర్పణ మొనర్చి. 129

శా. ఆరూఢాత్మవయోమదాంధతను శంకాతంకముల్ లేక స్వే
చ్ఛారీతి న్గడు నేనొనర్చిన యనాచారంబు లోఁగొంటి నీ

కారుణ్యంబున కేది మేరయని వక్కాణింతు రంగేశ యో
శ్రీరంగేశ్వర శాశ్వతశ్రుతిశిరస్సింహాసనాధీశ్వరా. 130

శా. శ్రీరంగత్కుచకుంభపాళిశిఖరోచిగ్నండలిక్ దుగ్ధపా
థోరాశిక్ దులసీవనంబునఁ ద్రిపాద్భూతిక్ బలెన్ మన్మనో
గారాప్తి న్వసియించి సంసరణదుఃఖంబు న్నివారింపు మో
శ్రీరంగేశ్వర శాశ్వతశ్రుతిశిరస్సింహాసనా ధీశ్వరా. 131

వ. అనుచు సన్నుతించినఁ బునఃప్రసన్నుం డై యతండు కోరినయట్ల
యొసంగి యాద్దేవదేవుం డి ట్లనియె. 132

క. వనజభవ వంశవర్ధన
ఘన మగు నీపుష్పమాలికా కైంకర్యం
బున నీకుఁ గల్గు సంతత
మును మత్సామీప్యపదవి ముల్లోకములన్. 133

మ. వసుధ న్మామకగోపికాజనరతివ్యాపార మేలీల వే
దసమం బై వెలసెం దదీయసరణిం ద్వత్పుణ్యచారిత్రమున్
దెసలం బ్రస్తుతి కెక్కు దీని వినినన్ విన్పించిన న్వ్రాసినన్
రసనం జేర్కొనఁ గన్న వారలకు మద్రాజ్యంబు నే నిచ్చెదన్. 134

## శ్రీరంగనాథుఁడు విప్రనారాయణున కాళ్వారు నామమిచ్చుట.

గీ. అనఘ తొండరడిప్పొడి యనఁగఁ బరఁగ
నీకు నాళ్వారి పేరు నాఁగాక యనియె
నతఁడు తొండరడిప్పొడియాళువార
లనఁగఁ బ్రఖ్యాతిఁ జెలువొందె నవని యందు. 135

గీ. జియ్యరును దేవదేవికి నెయ్య మెసఁగ
విహితవస్త్రాభరణ సమన్వితము గాఁగఁ
గనకపాత్ర సమర్పించి యనుపుటయును
న త్తలిరుఁబోఁడియు విరక్తచిత్త యగుచు. 136

క. పెరుమాళ్ళకు నాగిన్నియ
యిరుమడుగులపసిఁడి గాన్క యిడి తన కిదియే
తిరువారాధనగాఁ గొని
సిరివరు రంగేశ్వరుని భజింపుచు నుండెన్. 137

ఉ. న్యాయగుణప్రదీపన వచఃచ్ఛవిలజ్జితభారతీభవా
వ్యాయతనవ్యదేహ చరణాబ్జకృతార్థితదివ్యదేహ య
త్యాయతబాహుదండ విహితావహచండ సుబాహుదండ గా
ధేయమఖాధ్వరక్షణ సుధీజనబోధన యాధ్వరక్షణా. 138

క. దశరథరాజపురాజ
న్నశతకృతాగణ్యపుణ్యమందారఫలా
స్వశరీరచాపటంకా
రశరద్గర్జాజితేంద్ర రాజమృగేంద్రా 139

స్రగ్ధర వృత్తము.

పాదపాంసుపాలితాక్ష ♦ పాదదారవేదనా
వేదనాతిదీయతాభి ♦ వేద్యభృత్సనాదితా
నాదితాంగజారిచాప ♦ నాథవేదిజాలకా
వేదిజాలకాంక్షితాభి ♦ వృద్ధకల్పపాదపా. 140

గద్య

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర
శ్రీరామచంద్రకరుణాతరంగితవైభవ సారంగు నృసింహ
మంత్రితనూభవ పరిచిత భగవద్భాగవతకైంకర్య
విధాన తమ్మయాభిధానప్రణీతం బైన
వైజయంతీవిలాసం బను మహా
ప్రబంధంబునందు సర్వంబును
జతుర్థాశ్వాసము
సంపూర్ణము.